ఓమ్

శ్రీకృష్ణపరమాత్మనేనమః

శ్లో॥ గీతాయాః పుస్తకం యత్ర, యత్రపాఠః ప్రవర్తతే ।
తత్ర సర్వాణి తీర్థాని, ప్రయాగాదీని తత్రవై ॥

శ్రీ

# భగవద్గీతోపదేశసారము



## ప్రథమషట్కము

అర్జున విషాద, సాంఖ్య, కర్మ, జ్ఞాన, కర్మసన్న్యాస,
ఆత్మసంయమ యోగములు.

సులభ తెలుగు వచనము.


**తల్లాప్రగడ వీరేశలింగంశర్మ విరచితము.**

శ్రీ భగవద్గీతాప్రచారకుడు, ఇంజరం.





రెండవకూర్పు 500 ప్రతులు.

శ్రీలక్ష్మీముద్రాక్షరశాల,
కాకినాడ.
1940



*Copy right registered.*

ఓమ్.

శ్రీకృష్ణ పరమాత్మనేనమః.

శ్లో॥ ఇదంతే నా౽తపస్కాయ, నా భక్తాయ కదాచన,
నచా౽శుశ్రూషవే వాచ్యం, నచమాం యో౽భ్యసూయతి.

# భగవద్గీతోపదేశసారము.

ప్రథమషట్కము.

శ్లో॥ శ్రద్ధావాననసూయశ్చ, శృణుయాదపి యోనరః।
సోఽపి ముక్తః శుభాంల్లోకాన్, ప్రాప్నుయాత్పుణ్యకర్మణాం॥



శ్లో। య ఇమం పరమం గుహ్యం, మద్భక్తేష్వభిధాస్యతి।
భక్తిం మయి పరాం కృత్వా, మామేవైష్యత్యసంశయః॥

## తల్లాప్రగడ వీరేశలింగంశర్మ,

భగవద్గీతా ప్రచారకుడు:

ఇంజరం, కాకినాడతాలూకా.

శ్లో। నచతస్మాన్మనుష్యేషు, కశ్చిన్మే ప్రియకృత్తమః
భవితా నచమే తస్మాదన్యః ప్రియతరో భువి॥

# ఉపోద్ఘాతము.

భగవద్గీతోపదేశసారమును గ్రహించుటకు భక్తియోగాభ్యాసకు లెల్లరు నర్హులగుదురు. భగవద్గీత మోక్షగ్రంథరాజమన బరగుచున్నది. ఈ మహద్గ్రంథము బ్రహ్మవిద్యయొక్కయు, ఉపనిషత్తులయొక్కయు, యోగశాస్త్రము యొక్కయు సారముగలదై శ్రీ కృష్ణార్జున సంవాదరూపకముగ విలసిల్లుచున్నది. ఇందలి కథనమునకు భారతయుద్ధము నిమిత్తకారణము. ధృతరాష్ట్రుడు పృచ్ఛకుడు. సంజయుడు బోధకుడు. గ్రంథకర్త వేదవ్యాసుడు. ఉపదేశకుడు భగవంతుని పూర్ణావతారుడగు శ్రీ కృష్ణపరమాత్మ. ఈ గీతామృతమును గ్రోలి విజ్ఞానానందము ననుభవించిన యాదర్శపురుషు డర్జునుడు.

2. సంస్కృతభాషాజ్ఞానము గల ముముక్షువుల కెల్ల పలువిధ భాష్య, వ్యాఖ్యాన సహితములగు గీతాగ్రంథముల మూలమున గీతాప్రబోధము తేటతెల్లమగుచున్నది. గాన సామాన్యభాషాపరిజ్ఞానముగల జిజ్ఞాసువు లెల్లరకు మాత్రము సులభ తెలుగు వచనశైలిని గీతోపదేశసారగ్రంథమవసర మనిపించుకొనుచున్నది.

3. దేశముయొక్క ప్రస్తుత పరిస్థితులనుబట్టి గ్రామ పునర్నిర్మాణక్రమే మేర్పాటు గావింపజూచుటలో భావిపౌరులుగా బోవు యిప్పటి బాల, బాలికల స్థితిగతు లాలోచింపదగియున్నవి. వారలు కోమలహృదయులును, అనుకరణ ప్రీతికలవారును, పరిశీలనాసక్తులును, ఉత్సాహపూరితులును, ఉపాధ్యాయుల బోధలను తెలిసికొని యట్లు ప్రవర్తించు సహజలక్షణముగలవారునై యుందురు. అట్టి బాల్యదశయే విద్యాభ్యసనకాలముగా పరిగణింపబడి యున్నది.

అట్టి యుక్తకాలమునందే వారలకు సనాతనధర్మాచరణము, మతవిజ్ఞానము, నీతిమార్గానువర్తనమును పునాదిగ నిర్మింప కల్పతరువగు శ్రీ భగవద్గీతోపదేశసారము పాఠశాలలందు నుపాధ్యాయుల మూలముగ బోధింపబడగలుగుచో నీతి, మత బోధనాతత్త్వ మాచరణరూపమును దాల్చి దేశమందెల్లెడల వ్రేళ్లుబారుకొనగలదు.

4. నీతి, మత సంబంధమగు విజ్ఞానవ్యాప్తి దేశమందంతటను గాగలుగుటకు, యశోకునివంటి మతాభిమానముగల రాజపోషణయుండి యది శాసనబద్ధమైనయెడలనేగాని, సావకాశము లభింపగలిగి చిరస్థాయిగా నుండనేరదు. అట్టి కష్టసాధ్య విషయముగల యీ ఘనోద్యమమును విజ్ఞులెల్లరు ప్రేమతో నాదరించి, నెరవేర్పం బూనుకొనం గలుగుటకు ప్రార్థించుచున్నాడను. అందుపైని శ్రీ పఠనగ్రంథాంగీకార మండలివారు కూడ విశాలహృదయులును, కరుణారసభరితులును, నీతిమత విద్యాప్రచారకులును, దేశోద్ధారణ చింతకులునై విజ్ఞులెల్లరు ప్రేరేపించిన నీతి, మత విజ్ఞానవ్యాప్తి పాఠశాలలందు చిరస్థాయిగా నెలకొల్పగలరని మిక్కిలి యాసించుచున్నాడను.

5. ఈ కష్టసాధ్యమైన యుద్యమమునకు రసపోషణమును జేసి, సర్వవిధములగు విచారణస్థలముల యందును సిద్ధాంతపరచి, నిర్విఘ్న పరిసమాప్తిం బొందు జయమును ప్రసాదింపం బండితుల నెల్లరను వినయపూర్వకముగ వేడుచున్నాడను.

ఇట్లు,

ఇంజరం,
1–7–1940.

తల్లాప్రగడ వీరేశలింగం శర్మ,
గ్రంథకర్త—భగవద్గీతాప్రచారకుడు.

# ప్రథమ షట్కమందలి

## —: క థా సం గ్ర హ ము :—



ధృతరాష్ట్రుడుఁ తన కెప్పటి కప్పుడు యుద్ధవార్తలు తెలియు చుండునట్టి యేర్పాటును గావింపుఁడని వ్యాసునిఁ గోరుట. అందులకు వ్యాసుఁడు సంజయుని నియమించి పంపుట. సంజయుడా ప్రకారము ధృతరాష్ట్రునికి మున్ముందుగ యుద్ధసన్నాహ వృత్తాంతముఁ దెలుపుట. ఆవెంటనే యర్జునుఁడు శ్రీకృష్ణుని యుభయ సేనా మధ్యమున రథమును నిలుపఁగోరుటయు నందుచే తాను తనవారినెల్లఁజూచి వారలను రాజ్యకాంక్షచే జంప మనస్కరించక యుద్ధమునకు విముఖుఁడై విచారించుటయుఁ దెలుపుట. అందుపైని ధృతరాష్ట్రుఁడు తన కుమారుల కావిధముగ రాజ్యము నిలువఁగలదని తలఁచుట. అంతలో సంజయుఁడు శ్రీకృష్ణార్జును లిరువురకు యుద్ధాచరణముయొక్క యుక్తాయుక్త విచారణను గురించి కొంత సంవాదము జరిగెనని దెలుపుచు నట్టి వివరము నీరీతిగ దెలుపుట.

అర్జునునికి "పరాక్రమము కొఱకును, కీర్తి కొఱకును యుద్ధమును చేయుటయే ధర్మమా? లేక బంధువధవలని పాపభీతిచే యుద్ధమును మానుట ధర్మమా?" అనెడు సందేహము కలుఁగుట. ఈ సంశయమును మించిన దుఃఖము తన బంధు సముదాయముయొక్క మరణమును గురించి యతనిని పీడించుట. అందులకు శ్రీకృష్ణుఁడతని విషాదమును మరల్పఁబూని యందలి యుచితానుచితములను బోధించి దుఃఖనివారణముఁజేయుట. అంతట యర్జునుఁడు తన ధర్మసందేహములఁ దీర్ప శ్రీ కృష్ణుని శరణువేడుట. శ్రీకృష్ణుడంతట యర్జునుని స్థితిగతుల లెస్సగా బరిశీలించి యతనికి మున్ముందుగ ఆత్మ లక్షణములను, ధర్మ

ములను తెలియఁజెప్పుట. ఆటుపైని క్షత్రియధర్మములను, రాజనీతియు నుద్బోధించుట. పిమ్మట జన్మకును, కర్మకును గల సంబంధమును, మోక్షమార్గమునకు వలయు నిరుపాధిక వైరాగ్యలక్షణములను, వ్యవసాయాత్మకబుద్ధి ధర్మములను, ఇంద్రియ నిగ్రహోపాయములను, మనోనిగ్రహసాధనములను, స్థితప్రజ్ఞలక్షణముల నుపదేశించుట. అంతట యర్జునునకు కర్మ, జ్ఞానములరెండింటి తారతమ్యమును, వానిలో నేది తదితరమునకు క్రమసాధనమో, అందులకు హేతువులను తెలిసికొన నవసరము కలుగుట. అంతట శ్రీ కృష్ణుఁడతనికా విషయములను ముందుగ బోధించుట. అటుపిమ్మట సకామ, నిష్కామ కర్మయోగముల వివరము. స్వధర్మానుష్ఠాన శ్రేష్ఠత్వము, కర్మతత్త్వముయొక్క విశేషములు, కర్మానుష్ఠాన విధానము, దాని సంబంధమగు నుపకరణముల లక్షణముల నుపదేశించి, తుదకతని స్వధర్మమగు యుద్ధము నాచరించుటయే యతని కవశ్యము కర్తవ్యమని యుద్బోధించుట. అంతపైని కర్మయోగానుష్ఠానము జ్ఞానయోగావలంబనమునకు సాధనోపాయముగ మన్వాది పరంపరగా రాజర్షులవలంబించుచున్న సనాతనధర్మమే యని నిరూపించి తెలుపుచు, భగవదవతార కారణములను, ప్రయోజనములను బోధించుట. అజ్ఞానాంధకారము, జ్ఞానోదయము అనునవి కలుగు విధానమును, తన్నుపాసించు వారలు తనకుఁజేయు సేవయొక్క తన కర్తృత్వ భోక్తృత్వముల యెడల లౌకిక, పారమార్థిక భావములను, కర్మతత్త్వ వివరమును, కర్మతత్త్వజ్ఞుల వివరములును లెస్సగ నుపదేశించుట. కర్మయోగానుష్ఠానము జ్ఞానయోగావలంబనమున కెట్లు సాధనమగునో సవిమర్శగను, దృష్టాంతపూర్వకముగను బోధించుట. సంశయ నివారకమగు జ్ఞానముతో బంధువధసంబంధ జనితమగు పాపభ్రాంతిని నశింపఁజేసికొని, తన క్షత్రియధర్మమును నిర్వహింపుమని యర్జునునికి వక్కాణించి తెలియఁజెప్పుట. అంతట

యర్జునునకు కర్మానుష్ఠానము, కర్మత్యాగము వీనిలో దేని నవలంబించి దేనిని విసర్జింపవలెనో యను సంశయము కలుగుట. శ్రీకృష్ణుడంతనులకు కర్మానుష్ఠాన, కర్మత్యాగములనెడి వాని వివరమును, భేదమును, విధానమును, కర్మానుష్ఠాన శ్రేష్ఠత్వమును లెస్సగ బోధించి, కర్మయోగి యేవిధముగా జ్ఞానిగాగలిగి మోక్షార్హుఁడగునో విస్తరించి యుపదేశించి యతని సంశయనివారణముగావింపఁ బ్రయత్నించుట. సన్యాసికిని, యోగికిని భేదావస్థను మొదట నిరూపించి తుదకు సమానావస్థ యేలక్ష్యముతో నెట్లు సిద్ధింపగలదో నిర్ధారణముఁజేయుట. యోగలక్షణములను సవిమర్శగను, సంపూర్ణముగను, ఆచరణయోగ్యముగను బోధించుచు, యోగమహిమను విస్తరించి లెస్సగ నుపదేశించుట. తుద కాత్మయోగారూఢుడే తపశ్శాలురకంటెను, కర్మనిష్ఠాపరులకంటెను, జ్ఞానులకంటెను శ్రేష్ఠుఁడుగా గలడని సహేతుకముగా సిద్ధాంతీకరించి యదియే తన మతముగా గ్రహింపనేర్పుట.

—: సమాప్తము :—

---

# PREFACE.

I have carefully gone through the first volume of Bhagavadgeetopadesa Saram by Tallapragada Veeresalingam Sarma. It is a prose version of the greatest philosophical song of India. The author aims with success to bring the sublimest truths of the Geeta within reach of the school going children. In these days of religious apathy and materialism, this attempt is to be very much appreciated and I am sure that a study of this book surely makes the student more Hindu-minded, creating in aim a genuine thirst for more and more of Hindu culture and learning. The lucid manner in which the teachings are presented by the author is a great advantage to the beginner. The work meets the need of a good text book for the imparting of religious and moral instruction in schools.

S. T. V. N. H.<br>High School,<br>Pentapadu,

K. VENKATA RAO,<br>Head master,<br>8—7—1940.

—

శ్రీ

కృష్ణపరమాత్మనే నమః.

# భగవద్గీతోపదేశసారము

## ప్రథమషట్కము.

### అర్జునవిషాదయోగము :—

ధృతరాష్ట్రుడు జాత్యంధుడగుటచే తన కుమారుల యుద్ధమందు జరిగే విషయములు తన కెప్పటి కప్పుడు తెలియుచుండునటుల యేర్పాటును గావింపుడని వ్యాసుని యడిగెను. అంతట వ్యాసుడు తన శిష్యుడగు సంజయునకు సర్వవిషయ గ్రహణశక్తిని ప్రసాదించి ధృతరాష్ట్రుని కోర్కె దీర్ప నియమించి పంపెను. అందుచే సంజయుడు తనవద్దకు రాగా ధృతరాష్ట్రుడు తన కుమారుల యుద్ధవృత్తాంత మేమి జరిగెనని యతనిని ప్రశ్నించెను. ధృతరాష్ట్రుడు రాజ్య మెట్లయినను తన కొడుకులగు కౌరవులకే సంక్రమించవలయునని నిశ్చయాభిప్రాయము గలవాడు. సేనాబలమున్నా స్థానబలమున్నా కౌరవులకే గలవనియు, వారికే జయముగలుగుననియు విశ్వాసము గలవాడు. విషముపెట్టించుట, లక్కయింటిని గాల్పించుట, కపట జూదమున రాజ్యము నపహరించుట, అడవులకు సాగనంపుట, ద్రౌపదికి సభామధ్యంబున మానభంగ మొనర్చుట మున్నగు మహాపచారములను తన కొడుకులచే పొందిన పాండవులు పగపట్టి ప్రాణములు తెగించియున్నారని అతనియెదలో నాటుకొని యుండకపోలేదు. అయినను ధర్మరాజు ఎవరేమి యెంత చెప్పినను నీచమార్గమున బ్రవర్తింపడని యాతని పరిపూర్ణ విశ్వాసము. వారు చేరినది ధర్మక్షేత్రమగుటంజేసి యిరుదెగలవారును కూడ అధర్మము నవలబింప బూనుకొనక సంధిజేసుకొనెదరని యాతని యభిప్రాయము అంతియగాదు. రాజ్యమువంశక్రమాగతముగ కురు

రాజునుండి తనకు రాగా తాను పుట్టుగ్రుడ్డి యగుటం జేసి గౌరవమును దా నుంచుకొని పరిపాలన భారమును తమ్మునిపై తాను మోపినంతమాత్ర మున రాజ్యము పాండవులది గానేరదనియు, పాండవు లందుకు అధర్మ ముగ పోరినను జయింపజాలరనియు యతని విశ్వాసము. ధృతరాష్ట్రుని ప్రశ్నయం దిన్నితలంపు లిమిడియున్నవని సంజయుడు పర్యాలోచించి తగు సమాధానము నొసగదలచుకొని యతను కోరిన యుద్ధసన్నాహ వృత్తాంతము నిట్లు దెలుపనారంభించెను.

“రాజా! వీర్యవంతులును, శూరులును, మహారథులును, ధను ర్విద్యా ప్రవీణులును, యుద్ధనిపుణులు నగు పాండవసైన్యమును జూడు మని నీకుమారుడగు దుర్యోధనుడు ద్రోణాచార్యునితో చెప్పగా విని ఆయన యూరకుండెను. అంతట దుర్యోధనుడు ద్రోణాచార్యునితో మరల మన కౌరవపక్షమున యోధులనుబట్టిగాని, సేనయొక్క సంఖ్యను బట్టిగాని మనబలమే యధికము. పాండవబలము తక్కువ యనక తీరదు. పరబలమునకు భయపడి నీయొద్దకు వచ్చితిననుకొనవలదు.” అని పలికి నను ద్రోణాచార్యుడు మిన్నకుండెను. అందుపైని దుర్యోధనుడు “భీష్ము డొక్కడే నాకు రక్షకుడు. అతడొక్కడు సుఖముగనున్న నాకుజాలు. కాబట్టి మీమీ వ్యూహ ప్రవేశమార్గములందు జాగరూకులై భీష్మునే రక్షింపుడు.” అని ద్రోణాచార్యునితో నుడివెను. సేనాధిపతియగు భీష్ము డంత యీ స్థితిని గ్రహించి శంఖారావము గావించినంతనే కౌరవసైన్య మందు వాద్యములు పెల్లునమ్రోగి మహాశబ్దము గావింపబడెను. అంతట పాండవసైన్యంబున శంఖారావము భూమ్యాకాశములు నిండి మారుమ్రోగ కౌరవుల మనస్సు లలజడజెంది, గుండెలు పగిలి, ప్రజ్ఞ తప్పి, ధైర్యోత్సాహములు తొలగి, మహాభయము గలిగినది. శ్రీకృష్ణ భగవానుడు పాండవులకు జయము చేకూరునని ప్రతిజ్ఞ జేసెను.” సంజ యు డిట్లుచెప్పగానే ధృతరాష్ట్రుడు “కష్టా! ఎంతకష్టమువచ్చినది” అని

చింతిలసాగెను. అపుడు సంజయుడు కౌరవులను జయించెనను ఖ్యాతి యర్జునునికి రావలెనని భగవత్సంకల్పము. కౌరవులు కొనప్రాణములతో యుద్ధమునకు బూనిరి. అంతట యర్జునుడు బాణప్రయోగమునకు సమయమగుట గాంచి విల్లు మోపెట్టి శ్రీకృష్ణునితో నిట్లనియె.

"అచ్యుతా! ఈ రణంబున నెవ్వ రెవ్వరితో నేనుపోరవలయునో, దుర్బుద్ధియగు దుర్యోధనునకు యుద్ధంబున బ్రియముసేయుటకై యెవ రెవరు వచ్చిరో చూడగోరుదు. యుద్ధకాములై వచ్చిన వారిని నేను చూడవీలగునట్లుగా నుభయసేనలమధ్య నారథమును నిలుపుము." అని కోరెను. దృతరాష్ట్రా! కృష్ణుడంతట రథమునుదోలుకొనిపోయి ఉభయ సేనలమధ్య నిల్పి యర్జునుని యుద్ధమునకు వచ్చినవారిని జూడుమనెను. అటుపైని యర్జునుడచట తనతండ్రి తోబుట్టువులను, తాతలను, గురువులను, మేనమామలను, సోదరులను, కుమారులను, మనుమలను, సఖులను, మామలను సేనలో జూచి, మోహాముజెంది, పిశాచము పట్టినవానివలె, విషాదపడుచు శ్రీకృష్ణునితో నిట్లు పలికె ననెను. "కృష్ణా! యుద్ధమునకై నా యెదుటనున్న యీమావారిని జూచినంతనె నా కాళ్లు, చేతులు ముణ్ణుగునవి సడలుచున్నవి. నా నోరు తడియారుచున్నది. శరీరము నిలువెల్ల వడకుచున్నది. గాండీవము చేతినుండి జాఱిపోవుచున్నది. నా ధైర్యము నశించుచున్నది. రోమములు నిక్కవొడుచుచున్నవి. నా మనస్సు చక్రమువలె దిద్దిరతిరుగుచున్నది. నిలచియుండుటకు శక్తి లేదు. అంతరిక్షమునను భూమిమీదను శకునములు ప్రతికూలముగ దోచుచున్నవి. ఇక నాకు జయము కలుగుటెట్లు? మఱియు స్వజనమును యుద్ధమందు జంపుటవలన నాకు శ్రేయమేదియు గాన్పింపదు. గురువధ మహానర్థకమని శాస్త్రము. కులక్షయము కలుగును. కులధర్మములు నశించును. అధర్మము వ్యాపించును. వర్ణసాంకర్యము తటస్థించును. పిండోదక క్రియలు జరుగక పితరుల కధోగతి సంభవించును. కుల

ఘ్నులు నరకము పాలగుదురు. ఈఫలితమంతయు శాస్త్రప్రమాణముగ నున్నది. ఈ విధముగ పాపిష్ఠులైనచో నీ యాజ్ఞారూపములైన శ్రుతి స్మృతుల నుల్లంఘించుట తటస్థించును. అట్టి పాపాత్ముల నరకయాతనా దులందు ద్రోసి తపింపచేయుటవలననే నీకు జనార్దనుడనిపేరు వచ్చినది. స్వజనవధయే పాపము. దానికి కులక్షయదోషము తోడగుచున్నది. కాబట్టి నేనెట్టిపాపమునకును సిద్ధపడక, శత్రువుల వేటునకు దలయిచ్చి పాపరహితమైన మరణమునొందుట మేలు." అని చెప్పి యర్జునుడు శర చాపంబులు వదలి రథముమీద గూలబడెనని సంజయుడు ధృతరాష్ట్రునితో చెప్పెను. అందుపైని ధృతరాష్ట్రుడు అర్జునుడు యుద్ధమునకు వెరచెననియు అతని రథసారథియైన శ్రీకృష్ణభగవానుడు గూడ అందులకు సమ్మతించుచో తన కుమారులకు రాజ్యము నిలుచుట సిద్ధించుననియు తలంచెను. అందులకు సంజయుడు "కృపయనునది దీనులయెడ గలుగుట సహజము. ధార్తరాష్ట్రులు దీనులుగారు. వారియెడ యర్జునునికి కృప గలిగినది. అది లోకసామాన్యమైనదికాదు. కేవలము వ్యామోహ రూపమైనదియే. దానిని వదలించుట సులభసాధ్యముగాదు. అదియొక పిశాచమువలె హఠాత్తుగా వాని నావహించినది. ఇట్లు కృపాపిశాచగ్రస్తుడై దుఃఖించుచున్న యర్జునుని విషాదమును పిశాచోచ్చాటన సిద్ధమంత్రరూపమైన శ్రీకృష్ణుని బోధనావచనములే మాన్పదగినవి." అని భావించి కొదువ వృత్తాంతము నిట్లు తెలుపదొడగెను. అంతలో శ్రీకృష్ణుడర్జునుని విషాదమునుండి మరల్పదలచి "అర్జునా! నీవు పేరునుబట్టి శుద్ధస్వభావుడవు. వెలుతురునకు చీకటిదాపరించినటుల సమయముకాని సమయమున నీకీయనుచితమగు మోహము కలిగినందులకు శోకింపవయునే కాని నీవన్న స్వజనవధకు శోకింపంబనిలేదు. నీకు గలిగిన భయలక్షణములు నీచునకు దగునుగాని నీవంటి దేవతావరప్రసాదంబున జనించి వీరాధి వీరులను జయించి, పరంతపుడనపించుకొని, ముక్కంటినిని మె

ప్పించి, పాశుపతాస్త్రమునుగొని, నివాతకవచులను బరిమార్చిన వీరా గ్రేసరునకు దగవు. విద్వాంసులు మెచ్చదగినవి గావు. మరియు నవి నీ కపకీర్తిని దెచ్చునవియై యున్నవి. హృదయదౌర్బల్యరూపకమై క్షుద్రమైన యవివేకసూచకములగుచున్నవి. కౌరవులు నీకెన్నో యపకారములొనర్చిరి. వారల దోషసందర్శనంబే నీకు వారియెడ మమకారమును, క్షత్రియుడవగు నీ కులధర్మాచరణమునెడల నీ యవివేకమును మాన్పుటకు నుపాయమగును," అని బోధించెను. అంతమాత్రమున యర్జునుని విషాదము వదలక తిరుగ కొంతవర కతనిని బాధించి మరికొన్ని విషయములను కృష్ణునితో నీరీతిగ ప్రసంగింపజేసెను. "కృష్ణా! తండ్రి చనినంతనే దిక్కులేకున్న మమ్ము భీష్ముడు పెంచి పెద్దజేసెను. ద్రోణుడు తన యశ్వత్థామకన్న మమ్ము విశేషముగ బ్రేమించి ధనుర్వేదము గఱపెను. అట్టి పూజనీయులతో వినోదార్థముగ వాగ్వాదమైన జేయదగని స్థితిలో రణరంగంబున వారి నెదిర్చి బాణములు విసరుట దోషమున నిస్సంశయముగ• జెల్లును. ద్రోణుని వధించుటచే బ్రహ్మహత్యా పాతకము సిద్ధింపగలదు. ఇట్టి నెత్తురుగూడు దినుటకన్న రాజనిషిద్ధమైన భిక్షాన్నముతో జీవించుట మేలగును. జయాపజయములను నిర్ణయింప నెవరితరమును గాదు. ఇవన్నియు పర్యాలోచింపగా పెద్దలు, పూజనీయులు, సఖులు, బంధువులు మున్నగువారిని జంపుట అస్వర్గ్యమని నా మనస్సు దుఃఖపడుచున్నది. అయినను ధర్మవిషయమై రక్తమిశ్రమమైన భోగములుగల రాజ్యకాంక్షచే మహానుభావులైన పెద్దలను, ప్రియబంధువులైన పిన్నలను పరాక్రమముకొఱకును, కీర్తికొఱకును చంపి పాతకుడనగుదునని యుద్ధముమానుటయా? స్వధర్మమనియు, యుచితమనియు, పాపహేతువు కాదనియు, కీర్తిసాధనమనియు నీవు బోధించిన నీతిని నమ్మి యుద్ధము జేయుటయా? అను సంశయము వదలక నా మనస్సున్ను పీడింపనారంభించినది. నాకు సంశయనివారణమగునట్లు, "ఇంతవరకు

చెప్పినది వినలేదని యుపేక్షింపక, నాకు లెస్సగా బోధించి నా శోక మును మాన్పుము. ఇందులకు నీకన్న సమర్థులు లేరు. నేను నిన్ను భీష్మ, ద్రోణులకన్న బరమగురునిగా భావించినీ శరణుజొచ్చి నిన్నే నా ప్రాపుగా నమ్మియున్నాను." అని తన మనస్థితినిదెలిపి యూరకుండెను.

అర్జునవిషాదయోగము సమాప్తము.

---

2. సాంఖ్యయోగము:—

శ్రీకృష్ణభగవానుడు తన శరణునుగోరిన యర్జునుని స్వీకరించి, తరింపజేయ నుద్యమించి యాతనికి మున్ముందుగ ఆత్మవిషయమును బోధింపమొదలిడెను.

అర్జునా! నీ కేర్గుజేసిన శూరాత్ములగు ధార్తరాష్ట్రులను జంపుటను గూర్చి నీకు శోకము గూడదు. అజ్ఞానివై శోకించు చున్నావనుటకు పెద్దపండితునివలె ప్రజ్ఞావాదము జేస్తేదవు. అంతతో నుండక ధర్మసంమూఢుడను, శిష్యుడను ప్రపత్తిజేసితినంటివి. ఆ వెను వెంటనే యుద్ధముజేయ తలంపులేనివానివలె కాన్పించితివి. నీ చర్యలు పరస్పర విరుద్ధములై నవ్వుపుట్టించునవై యున్నవి. శోచనీయపదార్థము దేహమో, ఆత్మయో విచారణజేసి జ్ఞానులకు జననమరణ విషయిక శోక మేలయుండదో దెలిసికొనుము. ౨ అ. ౧౨ శ్లో. కాలము జరిగి నది, జరుగుచున్నది, జరుగనున్నది యని మూడు విధములుగ నుండును. నీవును, నేనును, ఈభీష్మాదులును పూర్వ, ప్రస్తుత ఉత్తరకాలముల మూడింటియందును యుండి యుండుచు యుండనైయున్నవారమె. మన ము అనగా మనయాత్మ అనియు, యీ ఆత్మ నశింపకుండ మూడుకా లములందుండునదియనియు, అట్టి నిత్యమైనదానిని గూర్చి విచారింపదగ దనియు ముందుగ గ్రహింపుము. ఆత్మకు జననమరణములుగాని, బాల్యా

దవ్యాస్థలుగాని లేవు. ౨౨ వ శ్లో. కాని యొక దేహానంతరమున మరి యొక దేహధారణము మాత్రము, మన వస్త్రధారణమువలె, గలుగుచుండును. సుఖదుఃఖము లనిత్యములై, మిథ్యలగుచు నింద్రియసంబంధములై వచ్చుచు, బోవుచుండునవిగాని యవి ఆత్మసంబంధములు గావు. తేనెయందు తీపి వ్యాపించియుండునట్లు, ఆత్మసత్పదార్థమై సర్వప్రపంచమును వ్యాపించియుండును. భీష్మాదులయందలి ఆత్మ నశించునని వెఱ్ఱితనముగా దుఃఖింపకుము. వస్త్రములవంటి దేహములు మాత్రము స్వభావసిద్ధముగ నశించితీరును. నీ యుద్ధమాదు వారి శరీరములను నీ బాణములు తాకకుండినను యవి శాశ్వతముగానుండబోవు. ౨౦ శ్లో. ౨౩, ౨౪ శ్లో. ఆత్మ యొకరిని జంపదు, ఒకరివలన జంపబడదు. ఏపనిని చేయదు. ఏఫలమును అనుభవింపదు. శరీరమువలె ఆత్మకు వికారములు గలుగవు. దానిని ఖడ్గాదులు ఖండింపజాలవు, అగ్ని కాల్పజాలదు, నీరు తడపనేరదు, గాలి శుష్కింపజేయజాలదు. ఒక చోటనుండి మఱియొక చోటునకు గదలునదికాదు. అనాదినుండి యున్నది. కంటికి గాన్పించునదికాదు. మనస్సుతో చింతించుదమన్నను, మనస్సున కందనిది. అవయవములు లేనిది. దేహమునకు సంభవించిన స్థితులేవియు నాత్మకు సంబంధింపవు. ఇప్పుడు నీ స్థితినిబట్టి నీకు ముఖ్యముగా గావలసినది యుద్ధముచేయుటయా! మానుటయా అనునది కాదు. ఆ సంగతియట్లుండనిమ్ము. మనశ్శాంతిలేక విచారపడుచున్న నీకు ముందుగ మనశ్శాంతి గలిగినయెడల పిమ్మట యేపని చేయుటకైనను నీవే నిశ్చయించుకొనగలవు. శీతోష్ణములు సుఖదుఃఖములు మున్నగు ద్వంద్వములెల్ల యింద్రియసంబంధములై వచ్చుచు బోవుచుండునవిగాని నిత్యమైనవి గావని గ్రహించి సహింతువేని యవి నిన్నెన్నడును కలవరపెట్టజాలవు. అపుడు నీకు మనశ్శాంతి గలుగును. అప్పుడు మాత్రమే నీవు జ్ఞానాధికారివి కాగలవు. జ్ఞానమును పొందితివేని ముక్తుడ వగుదువు.

అర్జునా! భీష్మాదులయాత్మ నశింపదని నీకు స్పష్టమయ్యెనుగదా! ఇక వారి శరీరములు నీవలన యుద్ధమందు నశించునని దుఃఖితువా? ఆ శరీరములు, నశించు స్వభావముగలవై నపుడు, నీవు తాకనంతమాత్రమున శాశ్వతముగా నెట్లుండనోపును? కావున ఆత్మ నశించునని విచారించుట వెఱ్ఱితనము. దేహనాశనము గురించి విచారించుట ప్రయోజనము లేని పని. భీష్మాదులు వారి కర్మఫలము ననుభవింపకనే యుద్ధములో చని పోయినచో, శేషించిన కర్మఫలానుభవమునకు నీ మూలమున తిరిగి శరీరధారులగుట వారికి అక్రమముగా తటస్థించునని విచారించెదవేమో? భీష్మాదుల కర్మఫలమేమియో, ఆయుర్దాయ మెంతయో తెలియనేఱని నీకావికార మెట్లుతగును? అనుభవింపవలసిన కర్మఫలము ననుభవించుట పూర్తియగువఱకు ఆశరీరమును తుపాకితో గాల్చినను నశింపదు. దాని కర్మఫలమంతయు నది యనుభవించినవెనుక దాని నమృతములో దాచి నను ఒకనిమిషమాత్రపు కాలమైన నది జీవించియుండదు. జీవనము లేని దానిని ఆపినను అనర్థమేగాని ప్రయోజనముండదు.

అర్జునా! నీశంక నింతవఱకును తత్త్వదృష్టితో విమర్శించి నిరసించితిని. ఇక లౌకికదృష్టితో విమర్శించి ఫలితములను చూచెదముగాక! నీవు క్షత్రియవంశంబున జన్మించితివి. రాజ్యమును సంపాదించుట, పరిపాలించుట, శత్రువులను వధించుట క్షత్రియులకు స్వధర్మము. నీధర్మమును నీవు చేయకతీఱదు. క్షత్రియులకు ధర్మమగు యుద్ధము శ్రేయస్కరము. ధర్మశాస్త్రమునుబట్టియేగాక శిష్టాచారమునుబట్టికూడ నీకు యుద్ధము కర్తవ్యము. నీకది యప్రార్థితముగా వచ్చినది. మఱియు నీ యుద్ధము నీ గురువులగు భీష్మ ద్రోణాదుల కొఱకు వచ్చినది గాదు; దుర్యోధనాదులను నుద్దేశించివచ్చినది. వారాతతాయులైవధ్యులై యుండగా వారితో భీష్మ, ద్రోణులు చేరిరి. సర్వశాస్త్రముల నెఱింగియు నిట్లుచేయుటవలన వారు ధర్మము నతిక్రమించినవారైరి. ధర్మము నెవరుల్లంఘించినను వారు, వీరనక శిక్షించుట రాజధర్మము. ధర్మ్యమైన యుద్ధ

ములో జచ్చినవారు నిరాటంకముగా స్వర్గమునకు జనుదురు. ఇట్టి యుద్ధము పుణ్యాత్ములకు మాత్రమే లభింపగలదు. ఈ యుద్ధము నాచరింపనిచో నీవు ధర్మోల్లంఘనచేసిన పాతకుడవగుదువు. కాలవిశేషంబున సంభవించిన ప్రారబ్ధరూపమగు నైమిత్తిక కర్మయును నీకులధర్మమైన యుద్ధమును యిప్పుడు చేయవేని కీర్తి యెల్ల నశించును. పాపముకూడ సంభవించును. ఇంతియేగాక అర్జునుడు "పిఱికివాడు" అను అపకీర్తి వచ్చును. అది యొకనాటితోపోదు. కలకాలముండును. నిన్ను దేవర్షులు కూడ నిరసింతురు. ఉభయలోకములలో నిట్టి తీఱనియపకీర్తి నొడికట్టుట కన్న మరణమే మేలని ఆత్మగౌరవముగలవాడు గ్రహించును.

అర్జునా! దుర్యోధనాదులమీద కృపవలన నీవు యుద్ధము మానినట్లు యెవరును తలచవీలులేదు. శత్రువులమీద కృపగలిగి యుండువానికి లక్షణము వారితో యుద్ధముజేయ దలపెట్టకుండుటయేగాని సన్నాహము జేసికొనిన తటినే విషాదముజెందుట గానేరదు. ఘోషయాత్రా గోగ్రహణాదులందు నీ పరాక్రమెఱింగినవారు కూడ పూల యంగడియందు కట్టెలు విక్రయించునట్లు, యానోటనే నిన్ను భయపడిపోతివని నిందింతురు. నీ వెనుకటి సామర్థ్యమును, ప్రస్తుతపు స్థితివిబట్టి, గప్పిపుచ్చునట్టి లేనిపోని కథల గూడ కల్పించి, పరిహసించుచు చులకనగా జూతురు. కావున యుద్ధము మానదలచుటవలన మేలేమియు లేదు. యుద్ధమున జచ్చితివేని స్వర్గమునొందుదువు. జయింతువేని రాజ్యభోగంబులను బడయుదువు. సకాలమున కీరెండు స్థితులును సమంజసములే యగును.

అర్జునా! నీ విషాదమే మోక్షసాధనమగు వైరాగ్య మనుకొనుచుంటివా! మోక్షసాధనమునకు వైరాగ్యము ప్రధాన మనదగునుగాని అది స్వయముగాను, క్రమముగాను, అభ్యాసవశముగాను కలిగినదై యుండినమాత్రముననే మోక్షసాధనమునకు ప్రధాన మనజెల్లును. నీ

యుద్ధమును గూర్చిన విషాదమువంటి యేదో యొక కారణముచే గలిగినదై యుండినయెడల ఆ కారణము నశించినతోడనే ఆ వైరాగ్యము కూడ నశించిపోవును. అట్టి తాత్కాలికపు సహేతుక వైరాగ్య మేమాత్రమును మోక్షసాధనమునకు దోడ్పడజాలదు. చిరకాల క్రమాభ్యాసము వలన గలిగిన నిరుపాధికవైరాగ్యము మేలొనగూర్చును. అందువలన బుద్ధిసమత్వము సిద్ధించును. అనగా మంచి చెడ్డలయందును, లాభనష్టములందును, జయాపజయములందును సుఖదుఃఖములు గలుగబోవు. అపుడు ద్వంద్వాతీతుడ వగుదువు. ఇప్పుడు నీకు గలిగిన వైరాగ్య మనుకొనునది విషాదమేగాని క్రమమైన వైరాగ్యముగాదు. వస్తుతత్త్వగ్రహణమును విషయగుణచింతనమును గలిగినకొలదిని కామము నశించిపోగా, చేయు కర్మముయొక్క ఫలమంటదు. అప్పుడు ఫలానుభవమునకు తావులేదు. అందుచే జన్మకు కారణమేయుండదు. ఇది మోక్షము. నీవు గ్రహించి యవలంబింపవలసిన ధర్మసూత్రమింతకంటె వేఱొకటి లేదు. నీకు యుపనిషదర్థమునందలి ఆత్మధర్మములను, లక్షణములను, సమబుద్ధిఫలితములను, వాటి పరస్పరసంబంధములను దెలిపితిని. కనుక నీవు బుద్ధి సమత్వమును ముఖ్యముగా సాధింప యత్నింపుము. సుఖదుఃఖాది ద్వంద్వముల కతీతుడవుగా దలంపుము. చేయు కర్మము లెల్ల స్వలాభార్థముగాక పరమేశ్వర ప్రీత్యర్థముగా నుండవలయునని నిశ్చయించుకొనుము. కర్మములకు ఫలము స్వతస్సిద్ధమైనను ఆ ఫలమును కర్త కోరనప్పు డది వానికి సంక్రమింపదనుకొనుము. పరార్థమగునని తెలిసికొనుము. ఫలము కర్తకు జెందనినా డాకర్మము బంధకము గాదు. అందుమూలముగ కర్మఫలానుభవమునకై కర్త జన్మలెత్తవలసిన యావశ్యకత ముండనేఱదు. ఇదియే కర్మము నాచరింపవలసిన విధానములోని ధర్మసూక్ష్మమని తెలిసికొనుము. ఈశ్వరారాధన రూపకముగ కర్మము నేమాత్ర మాచరించినను అది మోక్షసాధనమే యగును. ఇట్టి నిశ్చయ

ముగల బుద్ధి వ్యవసాయాత్మక బుద్ధియనబడును. దానిమూలమున జ్ఞానమును సాధించి తద్వారా మోక్షమును బడయుదువు. వ్యవసాయాత్మిక బుద్ధి సమగ్రముగా సిద్ధింపనంతకాలము నీవు జ్ఞాననిష్ఠ ననుష్ఠించుటకు అధికారివి గాజాలవు. ఈ విధముగ వినుటవలన నీకు గలుగు జ్ఞానము పరోక్షజ్ఞానమే యనబడును. విని, తెలిసికొనినదెల్ల స్వానుభవమునకు వచ్చినందువలన గలుగు జ్ఞానము మాత్రమే అపరోక్ష జ్ఞానమగును. ఇట్టిజ్ఞానమే చలింపనిదై నిత్యమగును. సమత్వబుద్ధిగలవాడు తన యోగక్షేమముల జూచుకొనబనిలేదు. వారి యోగక్షేమముయొక్క భారమును భగవంతుడే వహించుననుట నిశ్చయము. సమత్వబుద్ధిగలవానికి చిత్తశుద్ధియు నలవడును. పరమేశ్వరానుగ్రహమువలన యంతఃకరణము నావరించియుండు అజ్ఞానమాలిన్యము పోవును. సమస్త ప్రపంచ వ్యవహారముల విషయములందును ఫలానుభవములకు స్థానములగు స్వర్గాములందును తలంపే లేకపోవును.

అర్జునా! నీకు విషాదమువలన గలిగిన మనోకలవరము పోయి, చాంచల్యము మాని, సమత్వబుద్ధిచే చిత్తశుద్ధి గలిగి, పరవైరాగ్యము జనించి, అపరోక్షజ్ఞాన ముదయించుటకై యింతగా దెలిపితిని. నేను తెలిపినదంతయు నీవు మననము జేయగా నీకు ఆత్మతత్వము స్పష్టమై పరమానంద స్వరూపుడవు కాగలవు. దీనినే అద్వైతబ్రహ్మాత్మతత్వ సాక్షాత్కార మందురు. నీ సమత్వబుద్ధిని చలింపకుండ జేసి పరబ్రహ్మమును ధ్యానించుటకే నిదిధ్యాసమనిపేరు. ఈ నిదిధ్యాసము నీయం దెప్పుడు స్థిరమగునో యప్పుడు నీ వపరోక్షజ్ఞానివై స్థితప్రజ్ఞ డనిపించుకొందువు. అపుడు నీ మనస్సు మహానిర్మలముగా నుండును. కోరికలను గలిగి యుండదు. అంతఃకరణవృత్తులు జనింపవు. లోకవ్యవహార వ్యక్తి యుండదు. అఖండానందమయమై స్వస్వరూపానుసంధానమే యగుచుండును. ఇంద్రియములకు బుద్ధిప్రేరణ యుండదు. అవి తాబేటి యింద్రియ

వ్యాపారమువలె విషయగ్రహణగోష్టినుండి యుపసంహారమును పొందు చుండును. మనస్సు బ్రహ్మానందము నొకసారి చవిచూచినంతనె మఱల విషయానందమువంక దిరుగబోదు. మనస్సు సదా దేనినో యొకదానిని ధ్యానించుచునే యుండునేగాని యూఱకుండదు. ఆధ్యానమును ఆత్మాను సంధానముదెసకు ద్రిప్పి యందున్న రుచిని మఱిగియుండు నభ్యాసము నొసగినయెడల బాహ్యవిషయములకు మఱలదు. అప్పు డింద్రియము లెల్ల నూఱకుండవలసినవేయని గ్రహింపుము.

అర్జునా ! ఇంద్రియములు తమ యిచ్చవచ్చినట్లు విహరించునేని, మనస్సునకు నిలుకడ చిక్కనేఱదు. ఏ యింద్రియము దానిని బలముతో లాగునో దాని వంకకు మనస్సు మఱలును. అట్టి చంచలము మనస్సు నకు గలిగెనేని ఆత్మతత్త్వము నెఱుగవలయునవెడి పట్టుదల వీడిపోవును. నీమనస్సు అనే నావికుడు బుద్ధి యనెడి ఓడనెక్కి సంసారమనెడి సముద్రమును దాటజూచినప్పుడు ఇంద్రియములనెడి ప్రతికూలవాయువు వీవగా నీవప్పుడు పరమేశ్వరభక్తియనెడి లంగరును వేసికొని బుద్ధియనెడి యోడను నిలుపక ప్రతికూలవాయువనే యింద్రియముల యిచ్చవచ్చి నట్లు పోనిచ్చినచో విషయసుఖమను సుడిలోబడి పోదువు. కావున యింద్రియ నిగ్రహమనెడి యుపాయముచే నీబుద్ధిని నీవు రక్షించు కొనవలయును. లేనియెడల నీబుద్ధి చలించును. తదేక ఆత్మజ్ఞాన నిష్ఠ నిలువదు. ఆవిధముగా ఆత్మ తత్త్వము తెలియకమనశ్శాంతిచేకూరదు. ఆత్మానందము దొరకదు. అప్పుడు మనస్సు దేనిని తలంచునో ఆసంబం ధమువలన నట్టి కోరిక కలుగును. దానిని సాధించు ప్రయత్నమునకేదైన నడ్డమువచ్చినచో దానిమీద కోపము గలిగి దానిని హతముజేయ క్రో ధముకలుగును. అప్పుడే యుచితానుచిత వివేకమునశించును. అంతట మంచిని చెడ్డగాను, చెడ్డను మంచిగాను తలంచు మోహముపుట్టును. అప్పుడు బుద్ధి చెడిపోవును. అందువలన కర్తవ్యాంశము నిర్ణయము

గాజాలను. మనస్సు నెప్పుడు ఆత్మయందు సంపూర్ణముగా ప్రతిష్ఠించె దవో యప్పుడు భగవత్ప్రసాదముచే దానికి రాగద్వేషాది మలినము లంటక స్వచ్ఛముగ తత్స్వరూపంబగును. ఇదియే యింద్రియ జయమన బడును. ఈస్థితిలో మనస్సు యింద్రియ వ్యాపారములందు బ్రవేశించి యుండదని భావము. ఈస్థితిని సాధించి యమర్చుకొనినవాడు జితేంద్రియ పరుడనిపించుకొనగలడు. రాగద్వేషరహితమగు మనస్సుగలవాడే స్థిత ప్రజ్ఞుడనిపించుకొనును. సామాన్యులకు రాత్రిగానుండునది స్థితప్రజ్ఞునకు పగలుగాను, సామాన్యులకు పగలుగానుండునది స్థితప్రజ్ఞునకు రాత్రి గాను యుండును. అనగా సామాన్యులకు సత్యములును, నిత్యములని తోచునవి స్థితప్రజ్ఞున కసత్యములును, అనిత్యములునై తోచుచు యతని మనస్సు బ్రహ్మానందమయమైయుండును.

సాంఖ్యయోగము సమాప్తము.

---

### 3. కర్మయోగము :—

శ్రీకృష్ణు డర్జునునకు కర్మాచరణముయొక్క ప్రాధాన్యమును, విధానమును కొంతవఱకు సూచనగా బోధించి యదిచిత్తశుద్ధి నొసగుమూలముగా మోక్షోపాయమగు జ్ఞానోదయమునకు సాధనమగునని తెలిపినంతలో యర్జునుడు, కర్మ, జ్ఞానయోగముల రెండింటిలో తన యధికారమును బట్టి యేది తనకాచరణీయమో, నిశ్చయముజేసికొనలేక తన కేదో యొకదానిని నిశ్చయించి దెలుపుమని శ్రీకృష్ణుని కోరెను.

అంతట శ్రీకృష్ణభగవానుడు తాను బోధించినదానిని యర్జునుడు సరిగా గ్రహింపనేఱడయ్యెనని యూహించి కర్మ, జ్ఞాన నిష్ఠల కధికార తారతమ్యములను విస్పష్టముగా విశదపఱుచుచు, కర్మయోగ మనాది సిద్ధమైనదనియు, నదియెల్లఱకు నాళయభేదముతో పరమకర్తవ్యమనియు మున్నగు నంశములతో కర్మవిభాగమును, వాని యాచరణోద్దేశము

లును, ఫలితములును గల కర్మతత్త్వమును విస్తరించి బోధింపదలచి యావిషయములను సహేతుకముగాను, దృష్టాంతములతోను దెలుపుటకై యుద్దేశించి యిట్లు ఉపదేశింప బ్రారంభించెను.

అర్జునా ! నీ కింకను జ్ఞాననిష్ఠకు యోగ్యతకలుగలేదు. కాని జ్ఞానోపదేశము నొందుటకు దగినంతమాత్రపు చిత్తశుద్ధిగలుగుటచే జ్ఞానయోగమిట్టిదని తెలిపితిని. అంతమాత్రముననే నీవు జ్ఞానయోగము ననుష్ఠించుటకు దగవు. ఇంకను నీచిత్తము పరిశుద్ధము కావలసియున్నది. అంతపర్యంతము నీవు నీవర్ణాశ్రమములకు దగిన కర్మముచేయవలయును. అందువలన నిన్ను నీ క్షత్రధర్మమునందు నియోగించితిని. చిత్తశుద్ధిలేని వారెవరైనను జ్ఞానోత్పత్తి పర్యంతమొక విధముగను, పిదప మోక్ష ప్రాప్తిపర్యంత మొకవిధముగను కర్మములు చేయుచునే యుండవలయును. ఆవివరమును నిర్ధారణజేసి తెలిపెదను వినుము.

మోక్షమునకు జ్ఞానయోగము, కర్మయోగము అను స్వతంత్ర సాధనములు రెండుగలవని నీవు యోచించినట్లు కాన్పించుచున్నాడవు. కాని నేను నీకావిధముగ బోధించియుండలేదు. కర్మయోగము జ్ఞానయోగమున కంగభూతమగునేకాని యవి రెండును కేవలము వేర్వేరు యోగములై, యొకదానితో నొకదానికి సంబంధముగాని ప్రయోజనము గానిలేనివిగావు. ప్రతి మానవుడును తొలుతనే యంతఃకరణశుద్ధిని పొందవలయును. అంతపర్యంతము కర్మయోగము ననుష్ఠించుట కర్తవ్యమే. అటు పిమ్మట మాత్రమే జ్ఞానయోగము ననుష్ఠించుటకు యోగ్యత కలుగును. జ్ఞానయోగము సాక్షాన్మోక్షసాధనము. కొందఱను జన్మాంతర సుకృతవశంబున పుట్టుకతోడనే బాల్యమునందే యంతఃకరణశుద్ధి లభించును. అట్టి వారికి మాత్రమే కర్మయోగాభ్యాసముతో నిమిత్తము లేని జ్ఞాననిష్ఠకు యోగ్యతకుదురును. వారలకు పూర్వజన్మమునందే

కర్మయోగాభ్యాసము నెఱవేరి యంతఃకరణశుద్ధికి బ్రయత్నము సల్పబడి యుండుటయే వారు బాల్యమునుంచి తొలుదొల్తనే జ్ఞానయోగనిష్ఠకు యోగ్యులు కాగలుగుటకు గారణమని యెఱుగవలయును.

కర్మము నాచరించుటవలన దాని ఫలానుబంధముతో జన్మాంతరములు గలుగుచుండగా, యంతఃకరణశుద్ధియు, జ్ఞానోత్పత్తియు మోక్షప్రాప్తియు నెట్లు లభింపగలుగునని శంకింపకుము. ఫలాసక్తి లేక యీశ్వరార్పణబుద్ధితో నీ వర్ణాశ్రమధర్మములకు దగిన కర్మము నాచరించిన యెడల ఫలానుభవమునులేదు. జన్మాంతరమునులేదు. కాని తొలుత యంతఃకరణశుద్ధియు, క్రమముగ జ్ఞానోత్పత్తియు, తుదకు మోక్షప్రాప్తియు గలిగితీరుననుట నిశ్చయము. ఫలాపేక్షబుద్ధితో జేయు కర్మము సకామకర్మమనబడును. అది యంతఃకరణశుద్ధిని గలిగింపజాలదు. ఫలాసక్తి లేక యీశ్వరార్పణబుద్ధితో జేసినకర్మము నిష్కామకర్మ మనబడును. అయ్యది యంతఃకరణశుద్ధి నొనగూర్పగలదు. సత్పురుషుల యాచారమునుబట్టిగూడ కర్మము కర్తవ్యమని స్పష్టము. జనకుడు మున్నగు తొల్లిటి రాజర్షులు కర్మము లొనర్చి శుద్ధాంతఃకరణముగలవారై జ్ఞానమునుబొంది ముక్తులైరి. లోకులెల్లఱు తమతమ ధర్మముల నాచరించునట్లు జేయుటకే రాజర్షులుమాత్రమేగాక, నేను పొందవలసినదెద్దియు లేకపోయినను నరావతారుడనై మానవదేహధారు లెట్టి మార్గమున ప్రవర్తించుట సహజమో యామార్గము నవలంబించినట్లు కాన్పించుచు స్వధర్మమార్గదర్శకుడ నగుటకై కర్మము నాచరించుచునే యున్నాడను.

కర్తృత్వము, అభిమానము, ఫలాసక్తియను వానిని గలిగి కర్మములాచరించినవారు జన్మబంధము గలిగి ముక్తిని బొందజాలరు. కాని యవిలేకనే లోకసంగ్రహార్థము స్వధర్మముగ కర్మాచరణ మొనరించువారు ముక్తులై లోకమున కాదర్శప్రాయులేయగుదురు. ఆత్మతత్త్వజ్ఞానము పరమపురుషార్థమనుటసత్యము. అట్టి జ్ఞానోపదేశము

నకు మొట్టమొదటనే యందఱు అధికారులుకాజాలరు. అట్టి వారి బుద్ధికి తత్త్వజ్ఞానోపదేశము కలవరపాటును గలిగించును. వారి స్వభావము వారిని కర్మమువైపునకు లాగుచుండును. అనధికారికి జ్ఞానోపదేశము కర్మమునకు బ్రతిబంధకమై యుండును; ఇట్టితుదకు వారు రెంటజెడిన రేవడువలె ఉభయభ్రష్టులై చెడుదురు. కర్మాచరణముమువలన నంతఃకరణ శుద్ధిగలిగి, వైరాగ్యము తనంతట తానుదయించినప్పుడు కర్మఫల త్యాగమున కవకాశముగలుగును. అంత పర్యంతము శిష్టాచార ప్రకారము కులధర్మమగు కర్మాచరణ మొనరించుచు, శ్రవణ, మనన, నిదిధ్యాసల వలన క్రమక్రమముగ మనస్సుయొక్క పరిపక్వదశను పొందవలయును. మనస్సు జ్ఞానేంద్రియములకు మూలవిరాట్టు. ఆమనస్సుచేత జ్ఞానేంద్రియములను విషయాసక్తిని పొందనీయక నియమించి, కర్మేంద్రియ వ్యాపారమును సాగించుటకు సుముఖముగానుంచిన యెడల మాత్రమే కర్మానుష్ఠానమును, కర్మసన్యాసమునుగూడ సాధింపగలుగుదువు. ప్రతి పురుషుడు వానివాని వర్ణాశ్రమ ధర్మములగు కర్మములనే చేయవల యును. అందుల కనుకూలింపని కర్మములను జేయరాదు. పరులకు ధర్మములగు కర్మములను సాంగోపాంగముగా నొనర్చుట కన్న తనకు ధర్మములగు కర్మములను అంగవిహీనముగా నొనర్చినను, అంతలో మరణము సంభవించినను మేలేయగును. ఎవనికైనను కురూపియగు తన తల్లివలన తనకు మేలుగలుగునట్లు మహారూపవతియగు పరుని తల్లి వలన తనకు మేలుగలుగుననుటకు వీలులేకపోవుటయే యందులకు దృష్టాంతము.

బ్రహ్మ ప్రజలను సృష్టించునపుడు వారిని కర్మాధికారులనుగా జేసి కర్మముల మూలమున వారు వృద్ధిపొందునటులను, అవి వారల కిష్టార్థముల నిచ్చునటులను శాసించి యజ్ఞముల నేర్పాటుజేసెను. ప్రజలు చేయు యజ్ఞాదికర్మముల హవిర్భాగము యింద్రాదిదేవతలకు జెందును.

అందువలన దేవతలు తృప్తులై ప్రజలకు పశు పుత్రాది భోగముల నొసగుదురు. ఈ శాసనమునుబట్టి కర్మాచరణము కర్తవ్యమని స్పష్ట పడుచున్నది.

కర్మాచరణము మూలముగనే సూర్యకిరణ ప్రసరణమునకును, అందువలన వర్షమునకును, దానిచే సస్యాదుల యుత్పత్తికిని, యాహార పదార్థముల సంపాదనమునకును, భోజనమునకును హేతువు గలుగు చున్నది. ఆభోజన సారమే పురుషులందు శుక్లముగాను, స్త్రీలయందు శోణితముగాను మారుచుండును. దానిసమ్మేళనమే పిండోత్పత్తికి మూల మగుచుండును. ఈవిధముగ కర్మాచరణము పరమేశ్వరుని జగచ్చక్ర మున కొక లంకెయై జగద్వ్యాపారము నిమిత్తము కర్తవ్య మను దైవ శాసనముగ నేర్పడుచున్నది. కర్మాచరణమునుగూర్చి నాశాసనము ప్రకారము చేయనివాడు కర్మజ్ఞానమార్గముల రెండింటిని తెలియక యెడతెగని సంసారసాగరమందు మునుగుచు దేలుచనుండును. తాను విధ్యుక్తమగు కర్మము చేయకపోవుటయే గాక చేయువానిని ఆక్షేపించు వాడు పాపిష్ఠుడై నరకము పాలగుచు వివేకములేని జడుడగును. నా శాసనమందలి విధినిషేధ విషయములు యిష్టానిష్ట సాధనములని భావిం చుకొనుచు నాచరణార్హ కార్యములను, ఆచరణానర్హ కార్యములను సవిమర్శగ దెలిసికొనదగును. సామాన్యముగ మానవులకు చేయరాని కర్మములను చేయుచుండుటయును, చేయదగిన కర్మములను చేయక మానుటయును ప్రకృతియై యుండును. ఇందులకు కామమే మూల హేతువుగనుండి మహాపాపములను జేయించుచుండును. ఇది క్రమముగ నత్యుగ్రముగను పెరుగుచు తీరని యాశగలదై అంతములేక యుం డును. దీనికి సూక్ష్మ, స్థూల, అతి స్థూలములనెడు మూడవస్థలు గల వు. దీని సూక్ష్మావస్థయందు దాగియుచున్న విషయముయొక్క తత్వము తెలియదు. అందువలన దానియందంతగా పట్టుదలయుండదు. అగ్నిని

ధూమము కప్పియున్నటుల వస్తుజ్ఞానముగల మనస్సును కామము కప్పియుండి దానికి తత్త్వప్రకాశమును గలుగనీయదు. స్థూలావస్థయందు, మలినపడియున్న అద్దము ప్రతిబింబమును గ్రహింప జాలనటుల మనస్సునావరించిన కామము మనస్సునకు విషయజ్ఞానము గలుగకుండ దానిని మోహగ్రస్తముగ జేయును. అతి స్థూలావస్థయందు, మాయ గప్పియున్న శిశువు కాలు సేతులు గదలింపజాలక తనరూపమును తాను దెలిసికొనలేనట్లు, కామముచే గప్పబడిన మనస్సు జ్ఞానాత్మకమైన యంతఃకరణమును శుద్ధి గానీయదు. ఇక భోగావస్థయందలి, నిప్పునకు గట్టెలువేయు కొలది ప్రజ్వరిల్లునట్లు, యనుభవించు కొలదిని, తృప్తిపడక, దుఃఖమును గలిగించుచునే యుండును. ఇట్లు వివేకికి, అవివేకికిని నిత్యవైరిగనే యుండును. దీనికి జ్ఞానేంద్రియములైనను, కర్మేంద్రియములైనను, సంకల్పాత్మకమైన మనస్సును, వ్యవసాయాత్మకమైన బుద్ధియు నుపకరణములై యుండును. నేత్రాది యింద్రియములు దేహముకన్న నుత్కృష్టమైనవి. సంకల్పాతకమై యింద్రియముల నెల్ల నడిపించు మనస్సు యింద్రియములకన్న నుత్కృష్టమైనది. ఒక్క సంకల్ప మేమియు జేయజాలని దగుటచే సంకల్పమును నిశ్చయించి యాజ్ఞనిచ్చు బుద్ధి మనస్సుకంటె ఉత్కృష్టమైనది. ఆత్మ బుద్ధికి సాక్షిభూతమై యున్నది. ఇంద్రియాదుల కధిష్ఠానమైన కామము వివేకమును గప్పిపుచ్చి మోహమును గలిగించుచున్నది. మనస్సును సంస్కరించుకొని సాధించితివేని అది యాత్మసాక్షాత్కారమును పొంది స్థిరపడగలుగగా కామమ్ము తన పోకడలెల్లమాని నిర్బీజమగును. వాసనాసహితముగ కామమెప్పుడు నశించునో ఆత్మయపుడు నిరతిశయానంద రూపమున గోచరించును. అంతట పరోక్షా పరోక్ష జ్ఞానములు గలుగగలవు.

అర్జునా ! కర్మము కర్తవ్యమని సవిస్తరముగ నీకుదెలిపితిని. కర్తృత్వ, భోక్తృత్వ, మమకారములులేక, రాజాజ్ఞను భృత్యుడు నిర్వ

హించురీతని, నీవుచేయుకర్మము నాయారాధనయనినమ్మి నాకుసమర్పింపుము. నీవు నన్నట్లారాధించుచు నన్నే నీకు దిక్కుగానమ్మి నేనే నీకు బంధవిమోచనమును చేయుదునని దృఢనిశ్చయమును పొంది నీ సంసారశోకమును వదలి, నీ స్వధర్మమగు యుద్ధమును సల్పుము.

కర్తృత్వము, అభిమానము, ఫలాసక్తి యనువానిని గలిగి యజ్ఞానులు కర్మములు చేసి కర్మబద్ధులగుదురు. జ్ఞానులు కర్తృత్వాభిమాన ఫలాసక్తులను వదలి, లోకసంగ్రహార్థముగ స్వధర్మమగు కర్మమునాచరించియు కర్మబద్ధులుగారు. జ్ఞానికిని, అజ్ఞానికిని కర్మాచరణమునందలి భావమే భేదముగా నుండునుగాని విధానమందు భేదముండదు. కర్మముయొక్క స్వరూపత్యాగమును జేయదలచి నీ స్వధర్మమగు యుద్ధకర్మమును జేయమానకుము. నీకు చిత్తశుద్ధియందుపరిపూర్ణత్వము లేక పోవుటచే జ్ఞానోదయము గానేరదు. కావున నేనాజ్ఞాపించిన విధముగ నీస్వధర్మమగు యుద్ధము నాచరింప సంసిద్ధుడ వగుము.

కర్మయోగము సమాప్తము.

---

## 4. జ్ఞానయోగము :—

అర్జునా! యుద్ధవిచారముచే శోకమోహములకు జిక్కియున్న నీకు ఆశోకమోహములు తొలగుకొఱకు క్రొత్తగా నీకిపుడు కర్మనిష్ఠను ఉపాయముగా జేసికొని తత్త్వజ్ఞాననిష్ఠను బొందు యోగమును జెప్పితినను కొనకుము. మోక్షఫలకమైన యీ యోగమును నిఖిలజగదుద్ధారణార్థము మన్వంతరమప్పుడే సకల క్షత్రియవంశమునకు బీజమైన సూర్యునకు జెప్పితిని. అతడు తన పుత్త్రుడగు వైవస్వతమనువునకుచు, అతడతని పుత్త్రుడగు ఇక్ష్వాకమహారాజునకు నుపదేశించెను. ఇట్లు మన్వాదిపరంపరగా వచ్చుచున్న యీ యోగమును రాజర్షులుగూడ

యెఱింగినదైనను కాలక్రమంబున ఆ సాంప్రదాయమునకు మందమతులు, అజితేంద్రియులు, అనధికారులునైన పురుషులు బయలుదేఱి, కామక్రోధములకు జిక్కి జక్కగా నెఱవేర్పలేకపోవుచుండుటచే భంగమువాటిల్లుచున్నది. నీవు నాకు భక్తుడవు, సఖుడవు నగుటచే నీ ప్రియముగోరి సమస్త శ్రుతి, స్మృతి, పురాణేతిహాసములందలి పరమరహస్యమగు యీ యోగమును యథాస్థితిగ నేను నీకిపుడు జెప్పితిని. నేను నిత్యసర్వజ్ఞుడను. కావున నాకు జన్మాంతరమునందు జరిగినవి జ్ఞప్తియుండును. నీకట్లు జ్ఞప్తియుండదు. నాకు నీకుగల తారతమ్యమిది.

జీవుడు ప్రకృతికి లోబడియుండును. ఆ ప్రకృతి సత్త్వరజస్తమోగుణాత్మికమైయుండును. దీనినే మాయయని గూడనందురు. జీవుడీ మూడుగుణములకు లోబడియుండును గావునను సుగుణములు కర్మపరతంత్రములుగావునను జీవున కాయాగుణములబట్టి జన్మముగలుగుచున్నది. జీవుడు కర్మపరతంత్రుడుగావున ఏయే కర్మఫలమెప్పుడెప్పుడు భోగింపవలయునో యాయాకర్మఫలము ననుభవించుటకై యాయా కాలములందు దాని కనుగుణమైన జన్మము లెత్తుచుండును.

పరమేశ్వరుడగు నేను మాయకు లోబడను. మీదు మిక్కిలి మాయయే నాయాధీనమైయుండును. దానంజేసి నాజన్మము జీవుని జన్మమువలె గర్మాయత్తముగాదు. స్వేచ్ఛాయత్తమైయుండును. నా జన్మములు యవతారములనబడును. ధర్మమునకు హానికలుగునప్పుడును, అధర్మము వృద్ధిజెందునప్పుడును ధర్మసంస్థాపనార్థము స్వేచ్ఛాపూర్వక దేహధారణముకలుగును. దుష్టులవలన సాధువులకు బాధగలుగకుండునట్లు దుష్టులను వధించుటవలన సాధువులను రక్షించుటయగును. సాధువులను రక్షించుటయే ధర్మసంస్థాపనమగును. దుష్టశిక్షణ, సాధురక్షణము ప్రతియుగమందును జరుగును. ఇదియె భగవదవతార ప్రయోజనము.

అర్జునా! నాజననము లోకసహజమైనది గాదనియు, అది విశుద్ధ సత్త్వమయము, స్వేచ్ఛాకృతము, దివ్యమంగళశరీర గ్రహణరూపమునైన దనియు, నా యవతారప్రయోజనము ధర్మసంస్థాపనరూప మైనదనియు ఎవడు గ్రహించునో వాడు మరల జన్మింపడు, నన్నుపొందును. అనగా నన్ను ఆశ్రయించుటకు బాపమడ్డుచుండును; నా తత్త్వ మెఱుంగునేని అట్టిపాపము పటాపంచలై నశించును. పాపము నశించినంతనే ఈ జన్మమందే నన్ను ఆశ్రయించ గలుగును. నన్ను ఆశ్రయించినవానికి విజ్ఞానము ననుగ్రహింతును. దానివలన నన్ను పొంది జన్మరాహిత్యమును బడయుచున్నాడు. నన్ను ఏకాంతరూపమైన భక్తితోగొల్చువారు నన్ను క్షణమైనను విడిచి జీవింపజాలరు. వారికి బ్రహ్మాదులు వచ్చి తమ పదవులిత్తుమనినను నిరాకరింతురుగాని యాశింపరు. ఆస యెప్పుడులేదో యప్పుడే వారికి భయమును ఉండదు. రాగభయములు లేనప్పుడు క్రోధముండదు. రాగభయక్రోధములులేనప్పుడు సత్త్వగుణప్రధానులై నాకు మిక్కిలి ప్రియులగుదురు. అప్పుడునేను వారికి ఆత్మతత్త్వజ్ఞాన మిత్తును. అందువలన వారి యజ్ఞానము తొలగి, వారు పరిశుద్ధులై నారూపమును బొందుదురు. నన్ను నిష్కామముగా భజించువారికి మోక్షమును, సకామముగా భజించువారికి నైశ్వర్యాదులు నిత్తును. ఎవరేదేవతను యేఫలమునుగోరి యారాధింతురో ఆయా దేవతారూపంబున దద్భక్తులకు ఆయా ఫలములను, ఎల్లదేవతలు నా విభూతులేగావునను, తుట్టతుదకు వారి కర్మములెల్ల నన్నే చెందుటచేతను, నేనే యిచ్చుచుందును. భక్తులు తాము నన్ను ఉపాసించుటకు అనుకూలముగ నాయందారోపింపబడిన నామరూపము లన్నిటిని నేను పొంది వారి వారిచే నుపాసింపబడిన తెఱంగున యథోక్తఫలముల నేనే యిచ్చెదను. పూర్వసంచితములగు దురితములవలన వారి మనస్సులు కళంకములై, శుద్ధముగానుండ నేరకపోవుటచే వారు సద్యోఫలములందే దృష్టినుంచి, సంసారరూప

మైన జననమరణములనుండి తప్పించుకొన యత్నింపరు. ఈ జగత్సృష్టిని వ్యవహారదృష్టితో జూచినప్పుడు నేను కర్తనగుదునుగాని పరమార్థ దృష్టితో జూచినప్పుడు మాత్రము నేను కర్తనుగాను.

జ్ఞాని దేహాదులయం దభిమానములేక యుండును. అతనిచే జరుగు కర్మముతోడి సంగమును లేకయుండును. అతడు సదా నిజానంద లాభమున దృప్తిచెందియుండును. అందువలన అనిత్యమగు విషయఫలాభిలాష యుండదు. ఈ విధముగ నాతడు లోకసంగ్రహార్థమో, లోకనిందా పరిహారార్థమో కర్మముజేసినను అవి వానిదృష్టికి అకర్మములే యగును. మరియు వాని కవి లోకసామాన్యదృష్టిలోని స్వాభావిక బంధకత్వమును గలిగింపనేరవు. జ్ఞానికి యుదరపోషణకార్యమునకు ప్రారబ్ధదేహవాసనామాత్రముచే కారణము గలుగునుకాని కామవశంబునగాదు. అతడు నిరాశి అనగా సర్వకామములను వర్జించియుండును. యతచిత్తాత్మతను పొందియుండును. అనగా మనస్సును దేహమును రెండును స్వాధీనములై యుండును. అతడు తనకు దొరకినదానిని సంతుష్టిగ స్వీకరించును. గాని యిష్టానిష్టములతో నిమిత్తము పెట్టుకొని యుండడు. హితమైనప్పుడే సత్యమునైనను పలుకును. మితభాషిగనుండును. జిహ్వాచాపల్య మెంతమాత్రమును గలిగి యుండడు. సమస్తచరాచరమును సమభావముతో జూచునుగాని మనోభావమందు భేదమెన్నడును పొందడు. కాలకృత్యములను, క్షుత్పిపాసలను దీర్చుకొనుటకుమాత్రమే సంచరించును. గాని భోజనానంతర మాత డెందులకు నెచ్చోటను విహరింపదగిన యవసరములేక యుండును. కూర్చుండి చూచుచున్నను యతని దృష్టి లౌకికపరముగాక యధ్యాత్మపరమే యగుచుండును. అతని మనస్సు అతనికి స్వాధీనమైయుండును. కనుక యింద్రియములు వ్యాపారములయందు చలించుచు వానిని విషయాసక్తుని జేయజాలవు. అతడు ఆత్మారాముడై అద్వైతదర్శియైయుండును. అతనికి తనవారు,

పరులు అను భేదభావముగాని, యభిమానముగాని యుండదు. అతని కర్మములు పరాధ్యారోపితములు, శారీరకమాత్రములునై యుండును గాని అభిమానపురస్సరములుగానుండవు. శరీరపోషణ విషయమైనను నియమముతో బ్రవర్తించును. అప్రార్థితముగ లభించిన వానితో తనివి జెందుచుండును. శీతోష్ణసుఖదుఃఖాదిపీడ గలిగినప్పుడు స్వప్నములో జరిగినవానికై జాగ్రద్దశయందు కలుగు భావమువలె యవి మిథ్యలని దలంచియుండుటకు క్షోభజెందక నిస్పృహుడై, ద్వంద్వాతీతుడై విమత్సరత్వముగలిగియుండును. అతనికి "నేను యీపనిని చేయుచున్నాను, నేనీఫలము ననుభవించుచున్నాను". అను అహంభావమెంతమాత్రమెన్నడును యుండదు. అతని దృష్టిలో పరబ్రహ్మమునకు భిన్నమైనది మఱియొకటి లేదనియు, సర్వము బ్రహ్మమేయనియు నిశ్చయమైయుండును. అందువలన జేయువాడు, చేయబడుపని, చేయుట, దానిసాధనము, ఫలము, ఫలభోక్తమున్నగు సర్వము బహ్మమేఁయగును. లోక సంగ్రహార్థము నేనుచేయు కర్మమునందహంకారము, ఫలాపేక్ష అనునవి యుండవు. అట్టి కర్మనాకు బంధకముగానందున వాస్తవమైన కర్తృత్వమునుండదు. ఈమర్మము నెఱింగియే కర్మమునాచరించి తత్వార్థజ్ఞానముఁబడసి జనకాదులు జీవన్ముక్తులైరి. వారలకు ముందటివారలగు మన్వాదులు గూడ యట్టి కర్మమునే యాచరించిరి. ఈ కర్మయోగము నీకు పరంపరాప్రాప్తమైనది. కర్మతత్త్వముయొక్క మూడువిధములను సమగ్రముగ నెఱింగి, యనుష్ఠించి, సంసారమునుండి విముక్తుఁడవగుము. 1. శాస్త్రవిహితమైనచేష్టకర్మయనఁబడును. 2. శాస్త్రనిషిద్ధమైనచేష్ట వికర్మయనఁబడును. తూష్ణీభావము (ఉపేక్ష)గా జరుఁగు కర్మాచరణమును అకర్మమందురు. నదిలో నావ యెక్కిపోవునప్పుడు తీరమందలి వృక్షములు వాస్తవముగ గదలవు. అయినను నావపోకడను బట్టి ఆ వృక్షములు కదలిపోవుచున్నట్లు తోచును. అట్లే కర్మము నాచరించునది యంతఃకరణము.

కర్మము నాచరింపనిది ఆత్మ. ఈ నిజము నెఱుఁగుటయే కర్మయోగికి లక్షణము. కర్మతత్త్వజ్ఞులు ఆరురుక్షువులనియు, ఆరూఢులనియు రెండు విధములుగ నుందురు. మోక్షమును బడయఁగోరుచు, ఫలేచ్ఛలేక, కర్మము నాచరించినయెడల అతఁడు "ఆరురుక్షువు" అనబఁడును. ఫలాపేక్షయు, సంకల్పము గూడ లేకుండ వృథాచేష్టమాత్రముగా కర్మము నాచరించువాఁడు "ఆరూఢుఁడు" అనిపించుకొనును. అతఁడు లోకసంగ్రహార్థముగ ప్రవృత్తి మార్గమునననుసరించును. దీపము వెలిగించునంతనె యంధకారము తొలఁగునట్లు జ్ఞానోదయముగలిగినంతనె అవ్యవధానముగ మోక్షము సిద్ధించును.

అర్జునా! జ్ఞానరహితుఁడును, శ్రద్ధలేనివాఁడును, సంశయాత్ముఁడునైనవానికి యిహపరసుఖములే లేవు. యోగముచేత విడువఁబడిన కర్మలును, జ్ఞానముచే విడువఁబడిన సంశయములునుగల ఆత్మయోగిని కర్మలు బంధింపవు. జ్ఞానము గలిగినచో నీకు బంధువధ నిమిత్తమైన పాపభ్రాంతి నశించును. భీష్మాదులేగాక సమస్త ప్రపంచము గూడ అవిద్యాకల్పితమని స్పష్టమగును. పరమేశ్వరునికన్న భిన్నమైనది యేదియు లేదని బోధపడును. ప్రజ్వలితాగ్ని పచ్చికట్టెలను, ఎండుకట్టెలను అన్నిటిని కాల్చి బూడిదఁజేయునట్లు జ్ఞానము అజ్ఞానమునున్నూ, ఆగామి, సంచిత, ప్రారబ్ధాది సర్వకర్మములను నశింపఁజేయును. కావున నీహృదయమునందజ్ఞానమువలనఁ గలిగిన సంశయములను జ్ఞానమనెడి కత్తితోఁ దెగగొట్టి యోగస్థుడవై స్వధర్మమును నిర్వహింపుము.

జ్ఞానయోగము సమాప్తము.

---

## 5 కర్మసన్యాసయోగము

కృష్ణా! నీ వొకపరి శాస్త్రీయములైన కర్మములఁ బరిత్యజింపుమనియు, మఱియొకపరి ఆ శాస్త్రీయములగు కర్మముల నాచరింపుమ

నియు నాకుఁ బోధించుచున్నాడవు. వీనిలో నేను దేని నవలంబించుట శ్రేయస్కరమో నిశ్చయించి దానినే నాకు బోధింపుము." అని కోరిన యర్జునునికి శ్రీకృష్ణభగవానుడు కర్మయోగము, సన్న్యాసయోగము అను రెండింటి తారతమ్యమును తెలిపి వాటిలో శ్రేష్ఠమైనదానిని నిరూపించుచున్నాడు.

అర్జునా! కర్మత్యాగమును, కర్మానుష్ఠానమును గూడ జ్ఞానసాధనము లగుటచే నవి భిన్నఫలప్రదమైనవని పండితులు చెప్పరు. ఆత్మజ్ఞానశూన్యమైన కర్మత్యాగముకంటె చిత్తశుద్ధికరమైన కర్మానుష్ఠానమే శ్రేష్ఠమగును. రాగాదులులేని కర్మయోగి కర్మబంధమునుండి విముక్తుఁబడగలుగుచున్నాడు. కర్మజ్ఞానయోగములు రెండింటిలోను దేనినైనను లెస్సగ నాచరింపఁ గలిగినయెడల రెండింటి ప్రయోజనమును గలుఁగుచున్నది. జ్ఞానయోగి పొందు స్థానమును కర్మయోగియు పొందుచున్నాడు. కావున నీయోగముల నొకటిగనే దెలిసికొననగును. చిత్తశుద్ధిఁగలిగి, జితేంద్రియుఁడై, ఆత్మస్వరూపమును దెలిసినవాడు కర్మముల నాచరించినను, వానిచేతను బంధింపఁబడడు. నిర్లిప్తుడుగను, నిశ్చలుఁడుగను యుండఁగలడు. వాడు ప్రపంచమునందు, నీటిచేఁ దామరాకువలె, కర్మబంధముచే నంటఁబడకుండఁగనే ఫలాసక్తిలేక బ్రహ్మార్పణముగ కర్మముల నాచరింపగలుగుచునేయుండును. కర్మమును చేయుచున్నను, మనస్సునందు రాగద్వేషములు లేనివాడు, కర్మసన్న్యాసి యగును. కర్మమును చేయకున్నను, మనస్సునందు, రాగద్వేషములుగలవాడు సన్న్యాసి గాజాలడు. లోకమునకు కర్మలును, వాని నాచరించు బాధ్యతయు, వాని ఫలానుబంధసంబంధమును సృష్ట్యాదినిఁ గలిగి యుండవు. సృష్టియందు ప్రకృతిస్వభావమే యట్లు ప్రవర్తించుచుండును. బాహ్యవిషయములందాసక్తిని విడచి, ఆత్మయందు సుఖమును బొందెడి ఆత్మయోగి నాశనరహితమైన బ్రహ్మానందసుఖము ననుభవించును. ఆత్మ

యోగమునందు స్థిరముగ బుద్ధిని నిల్పినవాడు, మోహబంధము లేక బ్రహ్మవేత్తయై, సుఖదుఃఖముల నేటిని పొందక, నిత్యము నానందమయుఁడై యుండును. ఆత్మయందు క్రీడించుచు, ప్రకాశముఁ గలిగి, సుఖించుచున్న యోగి, పాపదూరుఁడై, సంశయరహితుఁడై, సర్వభూత హిత పరాయణుఁడై, కామక్రోధరహితుఁడై, నిశ్చలచిత్తుఁడై, ఆనంద స్వరూపుఁడై యుండును. జ్ఞానులగు సన్న్యాసులచే నఖండమగు యేమోక్షము పొందబడుచున్నదో అట్టి మోక్షము కర్మయోగులచే గూడ, చిత్తశుద్ధిమూలమున, క్రమముగ పొందఁబడుచున్నది. ఫలాసక్తిని విడచి, వేదోక్తకర్మముల నాచరింపనివానికి చిత్తశుద్ధిగలుగుటయు, జ్ఞానోదయమగుటయు నసంభవమగును. ఫలాసక్తిలేని కర్మాచరణమున మున్ముందుగ చిత్తశుద్ధియు, పిదప బాహ్యేంద్రియ నిగ్రహమును, పిమ్మట అంతరింద్రియజయమును, తదనంతరమున ప్రత్యగాత్మ సాక్షాత్కారమును, అటుపైని యా ప్రత్యగాత్మయే తానను సమ్యగ్జ్ఞానమును లభించును. ఇట్టి జ్ఞాని లోకసంగ్రహముకొఱకు కర్మములఁ జేయుచునే యుండును. అందులకు తనయందు కర్తృత్వమును భావింపక యింద్రియములు తమ తమ కార్యములయందు, వాటి సహజధర్మప్రకారము, ప్రవర్తించుచున్నవని తలంచుచుండును. అట్లు జరుగు కర్మముల నన్నిఁటిని పరమేశ్వరార్పణముఁ గావించుచుండును. తుదకు మోక్షముఁ గావలెననెడి కోరికను గూడ గలిగి యుండడు. అట్టియోగి జితేంద్రియుఁడై, కర్మసన్న్యాసియై, దేహమునం దనాయాసముగనుండి, ఆనందస్వరూపుఁడై నివసింపఁగల్గును.

అర్జునా! జీవు లవిద్యాలక్షణమగు మాయచే మోహితులై, అవివేకులై, తమయందు తమ కర్మముల కర్తృత్వమును, భోక్తృత్వము నారోపించుకొని, యజ్ఞానాంధకారమునఁ మునిగిపోవుచుందురు. కాని వారలకు గురూపదిష్ట వేదాంత వాక్యార్థ శ్రవణాదులు గలిగినపుడు, సూర్యోదయమైనంతనె సకల పదార్థములు ప్రకాశింపగలుగునట్టుల, వారి

యజ్ఞానము తొలఁగి హృదయము జ్ఞానముచే బ్రకాశించును. అందుచే వారు పాపరహితులై సకల భూతములయందు సమభావమునుంచు స్వభావముగలవారుకాగలరు. ఆ విధముగ వారు సమాహితచిత్తులై, బ్రహ్మానందమయులై, సర్వభూత హృదయాంతరవర్తినై, సకలమునకు సాక్షినైన, నారాయణుఁడగు, నన్నుఁదెలిసికొని జీవించియుండియు సంసారోపరతిరూపమైన మోక్షమును పొందుదురు.

కర్మసన్యాసయోగము సమాప్తము.

---

## 6. ఆత్మసంయమయోగము.

### (ధ్యానయోగము.)

అర్జునా! నిత్యనైమిత్తికములగు శ్రౌతస్మార్తాది కర్మములను, ఫలాసక్తిలేక, యెవఁడాచరించునో యాతడే సన్యాసియును, యోగియు నగును. ఎవఁడును అగ్నిహోత్రాదులను విడిచినంతమాత్రమున సన్యాసియును, కర్మముల నాచరింపనంత మాత్రమున యోగియునుగా నేరఁడు. నిజమైన సన్యాసి యగ్నిహోత్రాది కర్మములును, వాని ఫలాసక్తిని విడుచును. కర్మయోగి నిష్కామబుద్ధితో కర్మమునాచరించును. ఈ యుభయయోగములకును ఆత్మయందు సమబుద్ధియే పరమలక్ష్యము గావున నవిరెండును తుదకభేదముగనుండును. ఆత్మయోగమును పొందగోరెడి జ్ఞాని కర్మయోగమును మోక్షసాధనముగ నెంచుకొని, ఆ కర్మమునందకర్మమును జూచుచు, కర్మయోగమునాచరించును. ఆత్మయోగియగు జ్ఞాని చిత్తశాంతిని మోక్షసాధనముగజేసికొని, అకర్మమునందు కర్మమును జూచును, మోక్ష సుఖానందము ననుభవించుచుండును. మనస్సు యింద్రియములను జయించి, స్వేచ్ఛాప్రవృత్తిలేక, వివేకయుక్తముగనున్న చోనది, బంధువువలె, యుపకారిగాగలుఁగును. కాని యదియే

యింద్రియవశమై, స్వేచ్ఛాప్రవృత్తిపరమగుట తటస్థించిన యెడల శత్రువువలె యపకారియే యగును. కనుక సంగాదులను వదలి, వివేకముతోనున్న మనోజయముఁగలిగినవాడు సమాహితచిత్తుఁడై, ఆత్మజ్ఞానముతో ప్రవర్తింపఁగలఁడు. అతఁడు ధ్యానయోగాభ్యాసరూపమైన యాత్మానుభవమునందుండఁగలుగుచు, ధ్యానయోగియై, సంసారసాగరమునుండి తన్నుఁదాను తరింపఁజేసికొనఁగలుఁగును. అతడు కౌపీనాదులనైన సంగ్రహించుకొను తలంపుఁగలిగి యుండఁడు. ఏకాంతస్థలవాసియై నిరంతరము నంతఃకరణము నాత్మయందే స్థిరపరచుకొనును. అతడు తన ఆత్మశుద్ధికొఱకు యోగాభ్యాసము నాచరించుటకై, మెరక, పల్లము కాని సమానమగు స్థలమును నియమించుకొనును. అచట మొదట దర్భాసనమును, అందుపైని కృష్ణాజినమును, దానిమీద వస్త్రాసనమును యుంచుకొని, అందుమీద విషయాసక్తిలేని నిలుకడగల నిర్మలమైన మనస్సుతో నభ్యాసముఁ గావించుకొనును. తన శరీరము, శిరస్సు, కంఠము అనువానిని సమముగను, నిశ్చలముగను యుంచుకొని దృష్టిని ముక్కుకొనయందుంచుకొనును. అంతఃకరణమునందు శాంతమును, శుద్ధియును దీక్షగా నెలకొలుపుకొనును. పరమేశ్వరుఁడనైన నాయందు చిత్తమును బ్రహ్మచర్యవ్రతముతో నిలిపి నన్ను ధ్యానించుచు సేవించును. ఆహారమును నిద్రయును, మెలకువయును మితముగ నుంచుకొనును. ఇందువలన గాలిలేనిచోటనున్న దీపమును బోలి చిత్తము నిశ్చలమై యుండును. మనస్సు విషయాసక్తముగాక ఆత్మధ్యానమందే నిలుచును. ఇట్టి యోగి విషయములయందు నిస్పృహుఁడై, జ్ఞానసిద్ధినిబొంది ముక్తుఁడుగాగలడు. అతడు తన యోగసిద్ధిని గురించి యభ్యాసకాలమున "ఇంకను సిద్ధికలుగలేదే" యను తొందరపాటుగాని, విసుగునుగాని చెందఁదగదు. "తప్పక కలిగితీరును" అను నిశ్చయబుద్ధితోనే తన యభ్యాసమును కొనసాగించుకొనఁనగును. ఎప్పుడైన మన,

స్సు విషయాసక్తమగుట తటస్థించు నెడల, మరల్చి, తిరుగ దానిని ఆత్మ ధ్యానమునందే నిలుపఁదగును. అందువలన సులభముగా భేదభావము నశించి సమభావము జనించి, సకలభూతములను తనయందును, తన్ను సకలభూతములయందును, ఆత్మస్వరూపమునఁ జూడఁగలుగును. ఆ స్థితికి చేరగనే తన మహానందస్థితినుండి చలింపకుండగలడు. అప్పుడతడు నాకును, నేనతనికిని, నిత్యులమై ప్రవర్తించెదము. ఆత్మానుసంధానము లేనివానికి యోగసిద్ధి సులభసాధ్యము కానేరదు. యుక్తమగుఁ బ్రయత్నమున నింద్రియవశము చేకూరి, క్రమముగాను, సహజముగాను వైరాగ్యము లభించి, క్రమానుగతముగ చిరకాలము ప్రయత్నముచే సాధించుచు నల్పిన యోగాభ్యాసము తుద కతికష్టముతో సాధ్యముగానగును. ఒకేవేళ నామధ్యకాలమున మనస్సు చలించి, శ్రద్ధ వీడిపోయిననెడల, వాని కృషి కేవలము వ్యర్థమైపోనేరదు. కాని యందులకు ఫలితముగా నతఁడు పుణ్యాత్ములు నివసించెడిస్వర్గలోకమునందు చిరకాలము నివాసస్థానముఁ బొంది పిమ్మట భూలోకమున సదాచారసంపన్నులైనవారి గృహమున జన్మించును. సక్రమముగా నెడతెగని శ్రద్ధాభక్తులతో నభ్యసించుచు, మధ్యస్తముగ, కాలముతీరి మరణించినట్టి యభ్యాసి, జ్ఞానుల కులమున జన్మించి, తన పూర్వజ్ఞానము నభివృద్ధిఁజేసికొనుచు, యోగసిద్ధికి కొదువయైయుండిన ప్రయత్నమునకుఁ బూనుకొని, జన్మపరంపరలందు సిద్ధినిబొంది, ఆత్మయోగారూఢుఁడై, తుదకు బ్రహ్మసాక్షాత్కారమును పొందఁగలుఁగును. అతఁడు తపశ్శాలురకంటెను, కర్మనిష్ఠాపరులకంటెను, జ్ఞానులకంటెను కూడ అధికుఁడని తలపఁబడును. అర్జునా! యోగులందఱిలోను నాయందంతఃకరణముఁ గలిగి, నన్ను శ్రద్ధతో సేవించెడివాఁడు శ్రేష్ఠుడనియే నామతము. దీనినెఱిగి నీవు అట్టి యోగివిగాదలఁచుకొని, భక్తిశ్రద్ధలతో సక్రమముగ, దాని నభ్యసింపుము.

ఆత్మసంయమయోగము. సమాప్తము.

ప్రథమ షట్కము సంపూర్ణము.

# -: విమర్శాభిప్రాయములు :-

శ్రీ పరదేవతాయైనమః

జ్ఞానభూమియగు భారతవర్షమున నగ్రగణ్యముగ బ్రకాశించుచున్న మతగ్రంథరాజములగు ప్రస్థానత్రయములోని మూడవ ప్రస్థానమగు భగవద్గీతయందలి అమృతసందేశము యొక్క సారము ప్రజాసామాన్యమునకు సులభగ్రాహ్యము గాకున్నది. ఈ స్థితినిగురించి కాకినాడ తాలూకాలోని ఇంజరపురమందలి శ్రీ భగవద్గీతా ధర్మప్రచారక సమాజాధ్యక్షులునను, శ్రీ భగవద్గీతాప్రచారకులు నగు మ.రా.శ్రీ తల్లాప్రగడ వీరేశలింగం శర్మగారు పండితుల సేవచే నట్టి కొఱతదీర్పం బూనుకొనిరి. వారు చిరకాలము కృషిచేసి వారి జిజ్ఞాసామథనమునందు వారికి లభించిన గీతామృతబిందువుల నాంధ్రరాష్ట్రమునందలి తెలుగు జిల్లాలయందంతట నందజేయ నుద్దేశించిరి. వీరు తమప్రజ్ఞను ప్రకటించుకొను నుద్దేశము లేకయే గీతాప్రచార ప్రపంచమందు తాముపొందిన యానందమును తమ యాంధ్రసోదరు లెల్లఱకుం బంచియిచ్చు సముద్దేశముతో నీ "భగవద్గీతోపదేశసారము" అను పేర నీ గ్రంథము నెల్లఱి యామశాటులో నుండునట్టుల నిట్లు రచించి ప్రకటించుచున్నారని నా నిశ్చయాభిప్రాయము. ఈ గ్రంథమును నేను సవిమర్శగా జూచుటలో వీరి గ్రంథము పాఠశాలలందలి పఠనగ్రంథముగ గావింపబడవలయు నను వీరి ప్రధానోద్దేశము నాకు గన్పట్టినది. అందులకు నుచితములగు విషయములుగల గ్రంథమగుటంజేసి యీ గ్రంథకర్తగారి సదుద్యమము సఫలముం గావింప నా యిష్టదేవతా పరప్రసాదము వీరికి లభించుగాక యని కోరుచున్నాను.

నూజివీడు,<br>కృష్ణాజిల్లా,<br>31-12-1936.

ఇట్లు,<br>తురగా వెంకట్రామయ్య,<br>ఉయ్యూరు సంస్థానాంధ్రకవి

ఇంజరం గ్రామమందలి భగవద్గీతాధర్మ ప్రచారక సమాజము యొక్క అధ్యక్షులగు మ॥ రా॥ శ్రీ తల్లాప్రగడ వీరేశలింగంగారు పెంటపాడు గ్రామమున దీనెల 24, 25 తేదీలను శ్రీరామ సప్తాహపు పందిరియందు జరిగిన మహాజనసభలో భగవద్గీతను గూర్చి వరుసగా రెండు ఉపన్యాసముల నొసంగిరి. వారు భగవద్గీత యొక్క ప్రాముఖ్యమును గూర్చియు, గీతాసందేశమును గూర్చియు ప్రసంగించిరి. అనేక అధ్యాయములయొక్క యంశములను, అర్జునుని సంశయములను, సంగ్రహముగా దెలిపిరి. యుద్ధవీరుడగు నర్జునునకు జ్ఞానోపదేశమును గావించిన శ్రీకృష్ణుని యవతారసాదృశ్యములను, మహిమను, పరియవసానమును బోధించిరి. సభాధ్యక్షులగు శ్రీమాన్ కోపల్లి రామశాస్త్రులుగారు ప్రజలను, గీతోపదేశమును గమనించి యవలంబింపుడని, హెచ్చరించిరి. సభ్యులెల్లరు ఉపన్యాసములను మెచ్చుకొనిరి. స్త్రీ పురుషులనేకమంది సభకు విచ్చేసి, రెండు ఉపన్యాసముల నత్యంతాసక్తితోను, భక్తిశ్రద్ధలతోను, విని యానందించిరి. శ్రీ వీరేశలింగంగారు భగవద్గీతను గురించి గావించుచున్న ప్రచార క్రమమును మిగుల ప్రేమతో గొనియాడిరి.

అరిపిరాల వెంకటసుబ్బారావు, ఎమ్. ఏ. ఎల్. టి.
హెడ్మాష్టరు, గవర్నమెంటు ట్రైనింగు స్కూలు,
పెంటపాడు. 25–2–1937.



మ॥ రా॥ శ్రీ॥ తల్లాప్రగడ వీరేశలింగంగారు నేటి యుపాధ్యాయ సంఘసమావేశమందు భగవద్గీతయొక్క ప్రాముఖ్యమును గూర్చి యుపాధ్యాయు లెల్లరు, నిలుకడగల యాసక్తితోను, శ్రద్ధాభక్తులతోను, వినదగియున్న యుపన్యాసమును గావించి యుపాధ్యాయు లెల్లరకు నత్యంతాసక్తిని గలిగించిరి.

కె. సుబ్రహ్మణ్యం, బి. ఏ. ఎల్. టి.
జూనియరు డిప్యూటీయినస్పెక్టరు ఆఫ్ స్కూల్సు,
తాడేపల్లిగూడెం రేంజీ, 5–3–1937.

ఓమ్

—హరిహర దేవాయనమః—

శ్రీ భగవద్గీతా ధర్మప్రచారక సంఘాధ్యక్షులగు మ. రా. శ్రీ తల్లాప్రగడ వీరేశలింగ శర్మగారు, వారు విరచించిన "భగవద్గీతోపదేశ సారము" అను పవిత్రగ్రంథమున నాదిమట్కమును, స్వయముగ పఠింప, నాలకించితిని. అనేకోపనిషత్సారాకరమగు గీతాస్మృతి యందలి యా దార్ఢ్యమును తేటతెల్లముగ బాహిర మొనరించిన వారిలో వీరొకరిని పాఠకలోకమునకు విన్నవించుచున్నాడను. ఇదియే మదీయ సంగ్రహీంత ముఖ్యాభిప్రాయము.

రాజవైద్య, కవికంఠీరవ. } కాకరపర్తి కృష్ణశాస్త్రి. కాకినాడ. 21–8–1938.

---

ఓం

—శ్రీకృష్ణపరబ్రహ్మణేనమః—

సర్వపురుషార్థ సాధకమును, ఉభయలోక సంధాయకమును, శ్రీకృష్ణభగవానుని భావరత్ననిధానమును నగు శ్రీభగవద్గీతకు, విద్యార్థుల కొఱకు, సుబోధకముగ మృదుమధురశైలిని "గీతోపదేశసారము" అను నాంధ్రానువాదమును శ్రీయుత తల్లాప్రగడ వీరేశలింగం శర్మ గారు రచించి దయతో నాకుఁ జూపిరి. అది విద్యార్థులకు మాత్రమే కాక బ్రహ్మవిద్యారంభకుల కెల్లరకును గూడ మహోపకారకమని విశ్వసించి, నిరంతరాయముగ గ్రంథకర్తగారి సదుద్యమమును సఫల మొనర్ప సర్వేశ్వరుఁ బ్రార్థించుచున్నాను.

కొత్తూరు వెంకటశాస్త్రి.
రిటైర్డు తెలుగుపండితుడు-లేడీఆంప్థిల్
గవర్నమెంటుట్రెయినింగుస్కూలు
ఫర్ వుమన్—మచిలీపట్టణము.
20–10–1938.

## RESOLUTION.

At a meeting held at Samalkota 'on 25-12-1938 with M. R. Ry. Ch. Lakshmi Narayana Sastrulu gar, B.A., B.L., Vakil, Peddapur, in the chair, Swami Venugopalananda Rajayogi gar, spoke on Bhakti at length. There was a large gathering of people at which Sri Thallapragada Veeresalingam Sarma gar spoke on Bhagavadgeeta and its introduction in schools in plain prose style.

It is unanimously resolved that it is necessary in the interests of Future India, that Bhagavadgeeta shall be introduced as a class reader or book with different grades of intelligibility in plain prose vernacular.

Ch. L. N. SASTRY,
President,
25-12-1938.

---

—: శ్రీకృష్ణపరబ్రహ్మణేనమః :—

కాకినాడ తాలూకాలోని ఇంజరపురమందలి శ్రీభగవద్గీతా ధర్మప్రచారక సమాజాధ్యక్షులును, శ్రీభగవద్గీతా ప్రచారకులునగు తల్లాప్రగడ వీరేశలింగం పంతులుగారు భగవద్గీతలు లోకమునకు జ్ఞానప్రదములును నత్యంతోపయోగకరములునై యుండుటఁగాంచి, యానందించి, వాని సారమునంతను గ్రహించి, లోకులెల్లఱకు తేటతెల్లముగ నుండునటుల మృదుమధురశైలిని సులభ తెలుగు వచనరూపమున మున్ముందుగ ప్రథమషట్కమను నీగ్రంథమును రచించి, అచ్చొత్తించి తమ యానందమును లోకులెల్లఱు గూడ పంచుకొని యనుభవింపదగినదను యుదారబుద్ధితో పాఠశాలలలో బఠనీయగ్రంథముగ నిర్ణయింపబడుట కొసంగియున్నారు. మహనీయులగు శ్రీ పంతులుగారు వర్ణనీయమగు ఘనాశయముతో వ్రాసి యొసగిన నీ గ్రంథరాజమున లోకమునకు నావశ్యకములగు నీతులు, ధర్మములు విశేషముగా జెప్పబడి

యున్నవి. కావునను, యిందలి భావమొక్క నిర్మలౌన్నత్యములు ప్రశంసార్హములునై యున్నవి కావునను, యిందలి బోధలు సకల మతస్థులచే గూడ లెస్సగా గొనియాడబడదగినవి కావునను దీనిని పాఠశాలలలో బఠనీయగ్రంథముగా నియమింప బ్రయత్నించుటకు పఠన గ్రంథాంగీకార వర్గమువారికి నుచితముగానేయుండునని విన్నవించుచు శ్రీకృష్ణభగవాను లీయాశయము నెగ్గునట్లుచేసి తన గీతోపదేశమును లోకములో మఱింత బాగుగ సాగునట్లుచేయుగాకయని కోరుచున్నాను.

విమర్శకాగ్రేసర ధర్మస్థాపక. } కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రి,
కాకినాడ. ది 1-1-1939.

---

సభా తీర్మానము.

మ. రా. శ్రీ. శ్రీమాన్ కోమాండూరి శఠకోపాచార్యులుగారు, ఎమ్.ఏ., బి.ఎల్., వకీలు, కాకినాడ, వారి యధ్యక్షత క్రింద ది 1-2-1930 సం॥రం తేదీవి కాపులపాలెం గ్రామమున, శ్రీ సీతారామస్వామివారి కళ్యాణమహోత్సవసందర్భములో, మహాజనసభ జరిగినది. అందు భగవద్భక్తిని గూర్చియు, భగవద్గీతను గూర్చియు, శ్రీ సాహిత్యవిశారద, కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిలుగారు ఉపన్యసించిరి. అంతట భారతదేశపు భావిక్షేమమునకై భగవద్గీతను తెలుగులో సులభశైలి నుండు గ్రంథమును పాఠశాలల బాలురకు పాఠ్యముగ జేయవలెనను తీర్మాన ముపపాదింపఁబడి అందరిచేత నేకగ్రీవముగ నామోదింపబడినది.

కోమాండూరి శఠకోపాచార్యులు.
సభాధ్యక్షుడు.
కాపులపాలెం—1-2-1939.

ఓమ్.

శ్రీ తల్లాప్రగడ వీరేశలింగము శర్మగారు, తమ "భగవద్గీతోపదేశసారము, ప్రథమ షట్కము"ను, వ్రాతమూలముగనున్న కాలమున, నాకుఁ, జదివి చూడనిచ్చినపుడు నేనాగ్రంథమును చదివి చూచి తప్పక అచ్చొత్తింపమనియు, విద్యార్థులకుపయోగకరముగనుండుననియు ప్రోత్సహించినాడను. ఆప్రకారమువారాగ్రంథము నచ్చొత్తించి, నాపరిశీలనాభిప్రాయము నొసఁగగోరుచు, నాకొక ప్రతిని యిచ్చినారు. పుస్తకము యొక్క పీఠిక వారిగీతాపరిజ్ఞానమును పూర్ణముగ తెలియఁజేయుచున్నది. మంచి అనుభవముతోను, విశేష పాండిత్యముతోను మృదుమధురశైలిని బాలురకు, పెద్దలకు స్త్రీలకు, జనసామాన్యమునకు కూడ తెలియులాగున వీరు వ్రాసియున్నారు. మూలమున కెట్టి చెరుపులేక భావమును సులభముగ వచనమున వ్రాసియున్నారు. ఇట్టి గ్రంథము బాలురకు విద్యాశాలలయందు పఠనీయగ్రంథముగ నుండిన ఎంతయో శ్రేయోదాయకము. వీరి గ్రంథమట్లు కూడ వినియోగబడుగాక అని హెచ్చరించుచున్నాను. తతిమ్మా రెండు షట్కములున్నూ శీఘ్రకాలములోనే అచ్చువేయించగలరని తలచుచున్నాను. ఇందులకు పరమార్థతత్త్వజ్ఞులు తోడ్పడి, శీఘ్రకాలములోనే వారి ఆశయమును నెరవేర్చి, దేశమునకును, జ్ఞానా[illegible]నకును తోడ్పడుదురుగాత.

దర్భా వెంకటశివరామరావ్, బి. ఏ. బి. ఎల్. వకీలు.

కాకినాడ 8–3–1939.

---

## గ్రంథవిమర్శనము.

భగవద్గీతోపదేశసారము, ప్రథమషట్కము కాకినాడ తాలూకా యింజరం వాస్తవ్యులగు తల్లాప్రగడ వీరేశలింగం శర్మగారిచే ప్రకటింపఁబడినది. గీతోపదేశమందలి ధర్మసూత్రములు విద్యార్థుల కుపదేశించు

టకును, సనాతనవిద్యాభ్యాస సంప్రదాయము నుద్ధరించుటకును గ్రంథకర్త లీగ్రంథమును రచించియున్నారు. ఇందు భగవద్గీతయందలి మొదటి ఆరధ్యాయములలోని విషయములును సులభమగు శైలిని వచనరూపమున నీయబడినవి. బ్రహ్మశ్రీ విమర్శకాగ్రేసర కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రిగారి విపులమగు పీఠికయుఁ జేర్పబడినది. గీతాశాస్త్ర ప్రాశస్త్యమును గూర్చి భిన్నాభిప్రాయములు లేవు. ఎన్ని వివరణములు వ్రాసినను వ్రాయవచ్చును. ఈ గ్రంథమునందలి ముఖ్యవిషయముల సులభశైలిని వ్రాయబూనిన గ్రంథకర్తల యాశయము శ్లాఘనీయము.

ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక,
1939 ఏప్రెల్, మే—కాకినాడ.

—

ఓమ్

బ్రహ్మశ్రీ తల్లాప్రగడ వీరేశలింగం శర్మగారిచే రచియింపబడిన "భగవద్గీతోపదేశసారము" అను గ్రంథము (మొదటి షట్కము) ను చదివినాను. శర్మగారు గీతయొక్క సరియైనఅభిప్రాయమును, బాలురు, స్త్రీలు గూడ సులభముగ గ్రహించునట్లు చక్కగ వ్రాసి యున్నారు. శ్రమతస్థులకు నుపయోగపడు గ్రంథముగ నున్నది. వీరి యుద్యమమున కాస్తికులగు ధనికులు తగినంత సహాయము జేయవలయునని కోరుచున్నాను. మరియు జిల్లాబోర్డు అధికారులు మున్నగు విద్యాశాఖవారు గూడ పఠనీయముగ నేర్పరచి శర్మగారి గ్రంథములను వ్యాపింపజేయుటచే సర్వమత సామరస్యమును బోధించు భగవద్గీత నుపదేశించిన శ్రీకృష్ణభగవానుని సంపూర్ణకటాక్షమునకు పాత్రులగుదురు. శర్మగారు భగవంతుని యాశీర్వాదముచే నిట్టి మరికొన్ని గ్రంథములను రచించి యాంధ్రలోకమున కపరిమిత సహాయము చేయునట్లు ప్రార్థించుచున్నాను. శర్మగారికి నారాయణస్మరణపూర్వక ఆశీర్వచనములు.

చిద్ఘనానందేంద్ర సరస్వతీస్వామి,
కాకినాడ—27-7-1939.

ఓమ్

—:నమోనారాయణాయ:—

బ్రహ్మనిష్ఠాగరిష్ఠులగు తల్లాప్రగడ వీరేశలింగంశర్మగా రత్యంత భక్తిశ్రద్ధలతో రచించిన "శ్రీ భగవద్గీతోపదేశసారము" ను చదువం జనువ నాతనివితీరదయ్యెను. గీతారహస్యమును తెలిసికొనుట చాలా కష్టము. ఎందరెందరో ప్రతిపదార్థ తాత్పర్యములను వ్రాసిరి. కాని యింత విమర్శగా ఆబాలగోపాలమునకు అర్థమగునట్లు వ్రాసినవారులేరు. అట్టి గీతారహస్యమును నేటికాలమున కేమాత్రపు స్వల్పవిద్యగల స్త్రీ పురుషులకు గూడ అర్థమగు పదములతో వ్రాసిన యీ భగవద్గీతోప దేశసారము, ప్రథమషట్కమును చదివి చూడగా మిగత రెండుషట్క-ముల గ్రంథము గూడ శీఘ్రముగ సంప్రాప్తమగునట్లు పర మేశ్వరు డనుగ్రహించునట్లుగా మితిమీరిన యానందముతో గోరు చున్నాడను.

| | |
|---|---|
| తూర్పుగోదావరిజిల్లా, | ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః. |
| జీవకారుణ్యసంఘము, సామర్లకోట. | కారుణ్యానందస్వామి, 7-9.39. |

---

మ॥ రా॥ రా॥ శ్రీ తల్లాప్రగడ వీరేశలింగం శర్మగారు కాకినాడ తాలూకా యింజరం గ్రామములో "భగవద్గీతా ధర్మప్రచారక సమా జము" నెలకొల్పి దాని కధ్యక్షులుగానుండ దేశములో గీతాప్రచారము చేయుచు దానికిం బోలునట్లు తేటతెలుంగు వచనములో "భగవద్గీతోప దేశసారము" అను పేరుతో గీతాశాస్త్రమున కనువాదముచేసియున్నా రు. 18 అధ్యాయముల శాస్త్రము మూడు షట్కములుగా విభజించి మొదటి షట్కమచ్చువేయించి ప్రకటించియున్నారు. శర్మగారు నాకొక ప్రతి నిచ్చినారు. నేను దానిం జదివి యానందించితిని. చక్కని సులభ శైలితో సర్వజన సుబోధకముగానున్నది. అది చదివినచో గుహ్యాపదే



శము లేకయే భగవద్గీతా తత్త్వమును తెలియఁగలవారలయి, భక్తులు కృతార్థులగుదురని నాయభిప్రాయము. గీతల కిట్టి యనువాదము (సుబోధకమయినది) పుట్టియుండలేదని నానమ్మకము. పాఠశాలలలో నీ గ్రంధము పాఠ్యగ్రంథముగా నెలకొల్పినచో విద్యాశాఖాధ్యక్షు లాంధ్రదేశమున కెంతో మేలుచేసినవారగుదురని మనవిచేయుచున్నాను.

శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి,
రాజమహేంద్రవరము. 9-5-1940.
(మహామహోపాధ్యాయ, కళాప్రపూర్ణ,
ఆంధ్రవ్యాస, కవిసార్వభౌమ బిరుదాంకితులు)

సంఖ్య 16022

---

P. Ramachendra Rao, B.A., L.T.,
Head master,
Govt. Training School.

PENTAPADU,
8-7-1940.

To,

Sri Tallapragada Veeresalinga Sarma,
INJARAM.

Sir,

I have gone through the first volume of Sri Bhagavadgita Upadesa Saram written by you. The language is simple and chaste and the teachings of Lord Sri Krishna are lucidly explained in a mannner intelligible even to the school boys. I trust you will be able to complete the remaining two volumes at an early date.

I wish the work every encouragement.

P. RAMACHENDRA RAO,
Head master,
Govt. Training School,
PENTAPADU.